

*Chandamama Dec. '47*

*Photo by — Marcus Bartley*

సినిమా వేషం!




*Distributors :*

*Andhra & Ceded :* **PREMIER FILMS LTD., BEZWADA**

*Mysore :* **RAGHAVENDRA PICTURES, BANGALORE CITY.**

# చదువుకోండి



ఇంకా, ఇంకా, ఎన్నో!


సాలు చందా **6-0-0** — **చందమామ** — విడిప్రతి **0-6-0**

పిల్లల మాసపత్రిక


## గమనిక

★ 1—11—47నుండి సంక్రాంతి ప్రత్యేకసంచికతోసహా ఆరు రూపాయిలు. చందాకాపీలు సర్టిఫికేట్ ఆఫ్ పోస్టింగ్‌తో పంపుతాము. మరల మరల కాపీలు పంపబడవు. రు. 2—4—0 అదనంపంపితే ప్రతినెలా రిజిష్టర్‌లో పంపగలము. చందాసంఖ్య వుదహరించని వుత్తరానికి జవాబువుండదు. మాదిరి ప్రతి, వీ. పీలు పంపబడవు.

★ చందమామలో పిల్లల రచనలూ, ఫొటోలూ ప్రకటిస్తాము. చక్కని కార్డుసైజు ఫొటోలు, 0—0—9 బిళ్లతో పంపండి, ప్రచురిస్తే తెలుపుతాము, లేనిచో త్రిప్పి పంపుతాము. రచనలతో స్వంత అడ్రసు వ్రాసి, బిళ్లు అంటించిన కవరు పంపాలి. ప్రచురించని రచనలు త్రిప్పి పంపుటకు లేదా ప్రచురించే విషయం తెలుపుటకు వీలుంటుంది.

యీ సంగతులు గమనించి సాయపడండి.


ఆఫీసు: 37, ఆచారప్పన్ వీధి, మద్రాసు 1




పిల్లల మాసపత్రిక

సంపుటి 1 | 1 డిసెంబరు 1947 | సంచిక 6

## పాపలూ !

★ దీపావళిపండుగ వచ్చింది; పోయింది. మీరు కొన్న మందుసామానులు రంగుల రంగులతో సుర సుర వెలిగినై; నుసి అయిపోయినై. కాని దీపావళి 'చందమామ' మాత్రం మీ చేతుల్లో ఇంకా వుంది. దాన్ని భద్రంగా వచ్చే దీపావళిదాకా ఉంచుకోండేం!

★ పోతే ఈ నెలలో ముఖ్యమైన పండుగలేమీ లేవు మనకు. వచ్చేనెల జనవరిలో మన పెద్దపండుగ సంక్రాంతి రాబోతూవుంది. ఆ పండుగకు చందమామ ఎక్కువ పేజీలతో ఎక్కువ బొమ్మలతో ఎక్కువ కధలతో వస్తుంది. మీ చందమామకోసం ముందే జాగ్రత్తపడండి.

★ ★ ★




ఒకటి, రెండు, మూడు, నాలుగు
ఉడతలు, ఉడతలు, ఉడతలు, ఉడతలు!

గోడమీద గునగునగున,
కొమ్మమీద గబగబగబ,
దౌడుతీస్తు,
దాడిచేస్తు,
అయిదు,
ఆరు,
ఉడతలు, ఉడతలు, ఉడతలు!

పెద్దచార్ల జుబ్బల్తో,
బొదుతోక కుచ్చుల్తో,
ఏమిషోకు!
ఏమిబడాయ్!
ఏ, డెనిమిది, తొమ్మిది,
ఉడతలు, ఉడతలు, ఉడతలు!

చెట్టుచివరిదాక వెళ్లి,
ఇట్టే కిందకి మళ్లి,
భయంలేదు,
నయంలేదు,
ఆసరదా! ఆసందడి!
ఎన్ని ఉడత, లెన్ని ఉడతలు!
ఉడతలు! ఉడతలు! ఉడతలు!



ఒకటి, రెండు, మూడూ, నాలుగు
అయిదూ, ఆరూ, ఏడూ,
ఎనిమిది, తొమ్మిది, పాదీ !



మా పెరడంతా ఉడతలు!
మధ్య మధ్య ఒక తొండ!
చిన్న కోళ్లు, కొన్ని పుంజు
లన్నీ ఉన్నాయి.

అక్కరలేకుండానే
కొక్కొరోకోయని చెవిలో
పాడిపాడి కోడిపుంజు
ఏడిపిస్తుంది.

ఎదురుగా ఎగిరినట్లు
కదలక తల ఊపుతుంది
బండ లాంటి గూండా బహు
మొండి ఘటం తొండ!

కిటికీ దాకా వచ్చి,
చటుకున తుర్రోమంటాయ్!
'ఉడతా,' 'ఉడతా,' అన్నా
'ఊఁ' అయినా అనవు!
ఉరకలు, పరుగులు, గంతులు!

ఉడతలంటె ఇష్టం!
అమ్మకి, నాకూ, నాన్నకి,
అన్నయ్యకి అందరికీ
ఉడతలంటె యిష్టం, మహాయిష్టం!






## అమ్మ : తిమ్మ

అమ్మ :
కట్టెలు కొట్టర, తిమ్మా !
తిమ్మ :
కడుపు నొప్పి మా యమ్మా !
అమ్మ :
మల్లతెచ్చుకో, తిమ్మా !
తిమ్మ :
మఱి కాస్త మా యమ్మా !
అమ్మ :
పనికిమాలితివి, తిమ్మా !
తిమ్మ :
బాఋలు నేర్పిన దమ్మా !
అమ్మ :
పచ్చి దొంగవుర, తిమ్మా !
తిమ్మ :
బ్రతుకుట కిదేవీ లమ్మా !
అమ్మ :
తేరకు మేపము, తిమ్మా !
తిమ్మ :
పేరుంటుది మా యమ్మా !
అమ్మ :
కడుపు పెంచితివ, తిమ్మా !

తిమ్మ :
కావలసిన దే మమ్మా !
అమ్మ :
పరువు పోదురా తిమ్మా !
తిమ్మ :
సరిగా నుందెవ రమ్మా !
అమ్మ :
సిగ్గులేదురా తిమ్మా !
తిమ్మ :
జీవించే దెట్లమ్మా !
అమ్మ :
భూమికి భారము తిమ్మా !
తిమ్మ :
తామెందుకు మా యమ్మా !
అమ్మ :
మరియా దెఱుగవు తిమ్మా !
తిమ్మ :
మా బ్రతు కింతే నమ్మా !
అమ్మ :
చావగూడదా తిమ్మా !
తిమ్మ :
దేవుడు మరచా డమ్మా !

**ఏటుకూరి రవీంద్రం**



# తెలివి తక్కువ తోడేలు

అనగా అనగా ఒక ఊరు. ఆఊళ్లో ఒక కాపు. ఆకాపు తెల్లవారుఝామునే లేచి, సంకటిమూట భుజాన వేసుకొని పొలానికివెళ్లి పని చేస్తుండేవాడు. ఒక రోజున జొన్నపైరు కోసి పైటన్నం తింటూవుండగా చిట్టడవిలోనుంచి ఒక తోడేలు నకనకలాడుతూ వచ్చి, కాపు జొన్నసంకటిచూసి "మామా, మామా, నాకు కాస్త రుచిచూపించవూ?" అని అడిగింది. కాపు దయదలచి కాస్త పెట్టాడు. తోడేలుకు జొన్నసంకటి ఎంతో బాగుంది.

"మామా యిది ఎలావస్తుందో నాకుచెప్పవూ?" అని అడిగింది.

"పొలం దున్నాలి-" అన్నాడు కాపు.

"దున్నగానే సంకటి కడుపునిండా తినొచ్చుకదూ" అంది తోడేలు.

"అప్పుడే ఎలా వస్తుంది? జొన్న పైరు పెట్టాలి. ఎదగనివ్వాలి-"

"ఎదగంగానే సంకటి వస్తుంది కదూ?" అని అడిగింది తోడేలు.

"అంత తొందరపడితే ఎలా? పొంతం చెప్పనీ. ఎదిగి కంకివేసిం తరువాత మీబోటి పెద్దమనుషుల్ని, మీపరివారాన్ని కొంచెం దూరంగా ఉండేటట్టు చూడాలి."

"ఆసంగతి నాకు చెప్పాలా. ఈగని కూడా ఆ దాయలకన్నా రానియ్యను. అప్పుడు నాకు సంకటి తిన్నంత దొరకుతుందికదూ?" అనిఅడిగింది తోడేలు.

"అప్పుడేనా. విను, జొన్నకంకి బాగా పండింతరువాత నూర్పి ఆగింజలు తొక్కి వండాలి! అప్పుడుకాని సంకటి రాదు" అన్నాడు కాపు.

"అబ్బో, చాల చాకిరి ఉందే! అందాక కూర్చుంటే చావవలసిందే. ఆకలి అవుతున్నది. అంతకంటే తేలికమార్గం ఏదైనా ఉంటే చెబుదూ" అని జాలిగా చూచింది తోడేలు.

కాపు దీనితిక్క కుదర్చా లను కున్నాడు. "సరే అలాగైతే ఆబీళ్లో గుర్రమూ పిల్లా ఉన్నాయి. ఆ గుర్రపు పిల్లను తిను" అని సలహా యిచ్చాడు.

తోడేలు తిన్నగా గుర్రపుపిల్ల వద్దకు వెళ్లింది. పిల్ల అదిరిపడి ఒక్కగంతున తల్లి పొట్టకిందదూరింది. తోడేలు గుర్రం వెనకగ వెళ్లి పిల్లను పట్టుకోబోయింది. పెద్దగుర్రం ఎగిరి వెనకాళ్ల తో తోడేలు మూతిమీద ఒక్క తన్ను తన్నింది. ఆ తన్నుతో దిమ్మరపోయి తోడేలు మళ్లీ కాపుదగ్గరకు వెళ్ళి జరిగిన సంగతిచెప్పి, అంతకన్నా తేలిగ్గా తిండి దొరికే ఉపాయం చెప్పమన్నది.

కాపు మళ్ళీ చూచాడు. "సరే అదిగో ఆ దక్షిణపు బీడులో గొర్రెలమంద మేస్తున్నది. అందులో బాగా బలిసి



ఉన్న పొట్టేలునుచూసి తిను. నీఆకలి తీరుతుంది" అని చెప్పాడు.

తోడేలు మందదగ్గరకువెళ్ళి బాగా కొమ్ములు మెలికలు తిరిగి వున్న పొట్టేలును పట్టుకొని, "కాపు నిన్ను తినటానికి అనుమతియిచ్చాడు" అంది.

"అయితే చేసేది ఏముంది? ఒక్కటి మాత్రం మనవి చేస్తాను. నన్ను ముక్కలుముక్కలుగా కొరికి వెయ్యవద్దు. నాతిత్తి చీల్చవద్దు. నోరు బాగా విప్పుకొంటే నేనే నోట్లోకి దూకి పోతాను. నీకూ మింగే పనికూడా వుండదు.ఏమంటావు?"అన్నదిపొట్టేలు.

తోడేలు తలవూపింది. ముందరి కాళ్లతో గుంటతీసి, అందులో కాళ్ళు నిగడతన్ని నోరు పూర్తిగా తెరిచి కూర్చుంది. పొట్టేలు వెనక్కువెళ్ళి వెళ్ళి రయ్యినవచ్చి ఠాప్పుమని ఒక్క-టాకుటాకి పారిపోయింది.

ఆదెబ్బతో తోడేలుకు స్పృహ తప్పింది. గంటసేపువరకుకాని మళ్ళీ దానికి స్పృహరాలా. అప్పుడు దానికి చిన్నసందేహం వచ్చింది, "ఇంతకూ దాన్ని తిన్నానాలేదా?" అని.

కాసేపు ఆలోచించి "ఆఁ, ఆఁ.... బహుశా తినేవుంటాను" అనుకున్నది.



కోతిచేతులో రెండుసార్లు మోసపోయింతర్వాత కొంగ కోతిపని ఎల్లాగైనా పట్టాలనుకుంది. 'నేను చేసినట్లల్లా నువ్వుచెయ్యాలి' అని పందెంవేసింది కొంగ.



మొదట కొంగ మధ్య కడ్డీమీదవించి దూకి, కోతిని దూకమంది.



కోతి మధ్య కడ్డీమీద అవి చివరి కడ్డీమీదకి దూకింది.



కొంగ మళ్ళీ మొదటికర్రనించి చివరి కర్రమీదికి ఒక్కసారిగా దూకింది.



కోతికూడా అలాగే దూకబోయి నడుం విరగ్గొట్టుకుంది.

# శరణార్థులు

అనగా అనగా ఒక వుడత. ఆ వుడత ఒక మర్రిచెట్టు తొర్రలో కాపురము వుంటూ వుంది.

ఒకనాడు అది చెట్టు కింద కూర్చొని కాయలు తింటూవుండగా, సుడిగాలి వచ్చి చిన్న కొమ్మ ఒకటి విరిగి, దానిమీద పడింది.

ఇదివరలో, అప్పుడప్పుడు దానిమీద ఆకులు రాలుతూ వుండేవి గాని, కొమ్మ యెప్పుడూ విరిగి పడలేదు. అందువల్ల, ఆ కొమ్మ పడగానే, ఆకాశం విరిగి తన మీద పడుతూ వుందనుకొని, గాభరాతో అక్కడ్నుంచి గబా గబా పరుగెత్తడం సాగించింది.

అలా పోతూ వుండగా దారిలో ఒక కోడిపెట్ట దాన్ని చూసింది. చూసి



"ఎక్కడికి అంతగాభరాగా పరుగెత్తుకు పోతున్నావు?" అని వుడతను అడిగింది.

"అయ్యో! ఇంకేముంది! పరుగెత్తు పరుగెత్తు! ఇప్పుడే ఆకాశం విరిగి ఒక చిన్న ముక్క నామీద పడింది. యిక్కడుంటే మనమీద మళ్ళా పడుతుంది," అంది వుడత, కోడిపెట్టతో.

ఆ మాటలు వినేసరికి కోడికి కూడా గాభరావేసి, వుడతవెంట తాను కూడా గబా గబా పరుగెత్తడం మొదలుపెట్టింది.

పోతూవుండగా, దారిలో కుందేలు చూసింది, ఆ రెంటినీ. "అంత భయంతో పారిపోతున్నారు ఎక్కడికి? ఏమిటి సంగతి?" అని అడిగింది కుందేలు.

"అయ్యో! ఇంకేముంది! పరుగెత్తు! పరుగెత్తు! ఇప్పుడిప్పుడే యీ వుడత మీద ఆకాశంవిరిగి ఓచిన్నముక్క పడిందట. ఆ సంగతి అది నాతో చెప్పితే నేనూ



కొప్పరపు సరోజినీదేవి

పోతున్నాను. యిక్కడ వుంటే మనమీద మళ్లా విరిగిపడుతుంది," అంది కోడి, రొప్పుతూ.

ఆ మాటలు వినేసరికి, కుందేలుకి కూడా గాభరా పుట్టి వాళ్లతో పరుగెత్తడం మొదలుపెట్టింది. మూడూ కలిసి అదేపరుగున పోతూ వున్నయ్.

పోతూవుండగా దారిలో ఒక బాతు చూసింది. వాటి గాభరా చూసేసరికి, దానికి కూడా గాభరా వేసింది. రెక్కలు టపాటపా కొట్టుకుంటూ, తొట్టి పడపలాగ నడుస్తూ, వచ్చి "ఎందుకు అలా పరుగెత్తుకొని పోతున్నారు? ఏమిటి మీ హడావిడి?" అని అడిగింది.

"అయ్యో! ఇంకేముంది! పరుగెత్తు! పరుగెత్తు! ఇప్పుడిప్పుడే ఆకాశం విరిగి ఒక



చిన్నముక్క యీ వుడత మీద పడిందట. ఆ సంగతి కోడితో చెప్పితే, కోడి నాతో చెప్పితే, నేనూ పరుగెత్తుకు పోతున్నాను. యిక్కడ వుంటే మళ్లీ మనమీద పడుతుంది" అన్నది కుందేలు బాతుతో. అదంతా వినేసరికి, బాతుకు కూడా గాభరా వేసి, తనుకూడా వాళ్లతో పరిగెత్తడం మొదలు పెట్టింది.



ఆ నాలుగూ కలిసి ఎక్కడా ఆగకుండా పారిపోతూ వున్నయ్. పోతూ వుండగా ఒక నక్క చూసింది వాటిని. చూచి "అయ్యో! ఏమిటీ మీ కంగారు? ఎక్కడికి మీ పరుగు! ఆగండి! ఆగండి! మిమ్మల్నే! అంత రోస్తూ రొప్పుతూ పోతున్నారు ఏమిటి సంగతి?" అన్నది నక్క.

"అయ్యో! ఇంకేముంది! పరుగెత్తు! పరుగెత్తు! యిప్పుడిప్పుడే ఆకాశం విరిగి యీ వుడత మీద ఒక చిన్న ముక్క పడిందట. ఆ సంగతి అది కోడితో చెపితే, కోడి కుందేలుతో చెప్పితే, కుందేలు నాతో చెప్పితే, నాకూ గాభరావేసి నేనూ పారిపోతున్నాను. యిక్కడ వుంటే నీమీదకూడా పడుతుందేమో! పరుగెత్తు! పరుగెత్తు!" అని బాతు నక్కతో చెప్పింది.

నక్క పక్కున నవ్వి, "ఓస్! ఇందుకా మీభయం! నాకేమీ భయంలేదు. ఆకాశమేకాదు, యింకా యేది వచ్చిపడ్డా నాకు పరవాలేదు. హాయిగా నా యిల్లు యీ భూమిలో కట్టుకున్నాను. ఏదైనా విరిగిపడితే చప్పున దాంట్లో దూరి





వాళ్ళుంటాను." అని గర్వంగా చెప్పింది.

ఆ మాటలువిని "నక్క రావా! దేవుడి లాగ దొరికావు. మేము శరణార్థులం. నీ శరణు కోరాం. కాస్త మాకుకూడా నీ యింట్లో చోటిస్తే నీకెంతో పుణ్యం వుంటుంది," అని ఆ నాలుగూ అతిదీనంగా అడిగాయి.

నక్క తనలో తాను పొంగిపోతూవుంది, ఆ నాలుగూ దొరికినందుకు. కాని, పైకి మాత్రం "అబ్బే. నాయిల్లు చాలా చిన్నది. ఇంతమందికి చోటులేదు. యింకెక్కడన్నా చూసుకోండి," అని అంది. పాపం! నాలుగూ దిగులుపడ్డయ్. అయినా చేసేది ఏమీలేక నక్కనే మళ్లా మళ్ళా బతిమాలుతున్నయ్. అప్పుడు నక్క అతికష్టంమీద వప్పుకున్నట్టుగా నటించి, "సరే! రండి! ఏంచేస్తాం! చూస్తూ చూస్తూ శరణార్థుల్ని ఎలా కాదనగలను? కష్టాలు ఎవరికైనా వస్తయ్," అని వరసగా అన్నిటినీ తన సొరంగంలోకి తీసుకుపోయింది.

ఆరోజుకూ యీరోజుకూ ఆ శరణార్థులు బయటికిరాగా ఎవ్వరూ చూడలేదు.





## ఉండాలోయ్ ఉండాలి

బి. యస్. ప్రసాద్, నెల్లూరు.

ఇంటికి దొడ్డి
ఎడ్లకి గడ్డి
బ్యాంకికి వడ్డి
ఉండాలోయ్ ఉండాలి.

పాటకి ఇంపు
మాటకి సొంపు
మనిషికి తెంపు
ఉండాలోయ్ ఉండాలి.

చేనుకి పంట
ఆటకి జంట
బడికి గంట
ఉండాలోయ్ ఉండాలి.

ఇంటికి తలుపు
చింతకి పులుపు
గొడ్డుకి బలుపు
ఉండాలోయ్ ఉండాలి.

నియోగికి సీటు
పోలీసుకి బీటు
దొరలకి సూటు
ఉండాలోయ్ ఉండాలి.




ఇంటు గెలిచి రచ్చగెలవమని చెబుతారు. నాలాగా చిన్నతనం నుంచీ ఇంటో అందరిచేతా మొట్టికాయలూ, తిట్లూ తినేవాడు ఇంట గెలవటం చాలా కష్టం. ఇంటోవాళ్ళు తమ అభిప్రాయాలు మార్చుకోరు. మన ప్రవర్తనను బట్టి కూడా వాళ్ళు అభిప్రాయాలేర్పరుచుకోరు. వాళ్ల అభిప్రాయాలనుబట్టే మన ప్రవర్తన ఏర్పడుతుంది. మన పెద్దవాళ్ళు మనని బండవెధవలుగా చూస్తే బండవెధవలుగానే ఉంటాం. తెలివిగలవాళ్ళుగాచూస్తే తెలివితేటలు సంపాదించుకుంటాం. అబద్ధాలకోరుగాచూస్తే అబద్ధాలే ఆడతాం.

బడిలో అట్లాకాదు. ఏకారణం చేతనైనా బడిలో మనకొక పేరు వచ్చినా, మనం కష్టపడి ఆపేరు మాపుకోవచ్చు. ఒకవేళ పేరు పోకపోయినా, ఆపేరును గురించిన అభిప్రాయం మారిపోవచ్చు. అయిదో క్లాసులోకి వచ్చాక నన్ను చాలామంది విద్యార్థులు గౌరవంగా చూడసాగారు. నన్ను బండరాముడని పిలిచేవాళ్ళు కూడా ఆపేరు గొప్పగానే చూసేవాళ్ళు గాని, హీనతగా చూసేవాళ్ళుకారు. బండరాముడంటే పట్టుదల కలవాడనీ, ధైర్యం కలవాడనీ, చులకనగాచూస్తే ఊరుకునేవాడు కాదనీ బడిలో అర్థం వచ్చేసింది.

అయినా ఇంటిదగ్గిర మటుకు నా కీర్తి ఏమీ పెరగలేదు. ఇంటిదగ్గిర నేను ఎప్పటి బండరాముణ్ణే. బడిలో నాకుండే తెలివితేటలన్నీ బడిగేటు దగ్గిరే మాయమయేవి. బడిలో చక్కగా వప్పగించే పాఠాలే, మా నాన్నదగ్గిర వప్పగించబోతే తప్పుపొయ్యేవి. బడిలో



రైటుగా చేసేలెక్కలే మానాన్నదగ్గిర చేస్తే సరిగా వచ్చేవికావు.

"మీరాముడు **బడిలో** చాలా **తెలివి**గా ఉంటున్నాడు" అని మానాన్నతో ఎవరైనా చెబితే, వెంటనే **మానాన్న** "వాడిమొహం! వాడికి బళ్ళో ఎందుకు మార్కు లిస్తున్నారో? కాపీ కొడుతున్నాడో ఏమో? వాడికి రెండోఎక్కం కూడా సరిగారాదు. పట్టుమని రెండు బంతులు తప్పులేకుండా చదవలేడు." అని ప్రచారం చేసేవాడు.

మా అమ్మకూడా ఇరుగుపొరుగు ఇళ్లవాళ్ల దగ్గిర ఇటువంటి **మాటలే** అనేది. అందుచేత బడివొదిలి **ఇంటికి** వస్తే నేను ఎప్పటి బంతరాముడుగానే ఉండేవాణ్ణి. నన్నుగురించి మా **చుట్టు**పక్కలవాళ్ల కెవరికీ అభిప్రాయం మారలేదు.

మా యింటిపక్క సందులో **పీను** అనే కుర్రవాడున్నాడు. వాడు **నాకన్న** మూడు, నాలుగుగేళ్ళుచిన్న. **వాణ్ణి** కిందటి సంవత్సరం బడిలోవేశారు. కాని వాడు బడికిపోడు. బడికిపోతే మేష్టరు కొడతాడని వాళ్లమ్మకుభయం. బడికిపోకపోతే చెడిపోతాడని వాళ్ల నాన్నకు భయం. చదువుకుంటే పిల్లవాడు నలిగిపోతాడని వాళ్లమ్మకు భయం. చదువుకోకపోతే ఇతర పిల్లలతో అల్లరి చిల్లరగా తిరిగి దురలవాట్లు నేర్చుకుంటాడని వాళ్ల నాన్నకుభయం. ఈ ఇద్దరిమధ్యాచిక్కి సీను ఎటూ కాకుండా చెడిపోయినాడు. సంవత్సరమల్లా బడికివెళ్లినా సరిగా అయిదు బళ్లూరాలేదు. రోజూ ఏడుస్తూ బడికి పోవటమే. వాడికి మేష్టరంటే భయం. చదువంటే భయం. పుస్తకాలంటే భయం. బడిఅంటే భయం. అందుకే వాడికి చదవురాలేదు. ఒకరోజు బం

వంతాన బడికివెళ్లేవాడు. రెండోనాడు కానీ లంచంఇస్తే వెళ్లేవాడు. మూడో నాడు అర్ధణాఇస్తేగాని వెళ్లేవాడుకాదు. నాలుగోరోజు అణాయిచ్చినా అది పట్టుకుని ఎక్కడికోవెళ్లి గోలీలూ, కర్రాబిళ్లా ఆడేవాడుతప్ప బడికిమాత్రం వెళ్లేవాడు కాదు.

వాడి చదువుగురించి రోజూ వాడి అమ్మా నాన్నా పోట్లాడుకునేవారు. "వాడికి చదువురాదు. రాదని పంతులు కొడతాడు. రానివాడికి కొడితే వస్తుందా? చదువులేకపోతే పీడాపాయిరి. నిష్కారణంగా పిల్లవాణ్ణికొట్టి చంపుతామా?" అనేది తల్లి.

"ఇట్లాగే అశ్రద్ధచేస్తే వాడికి అసలు సంతకం చెయ్యటంకూడా చాతకాకుండా పోతుంది. ఆతరవాత గొర్ల గాస్తాడో, అడుక్కుతింటాడో!" అనే వాడు తండ్రి.

ఈ పోట్లాటలు చూసినకొద్దీ సీనుకు చదువంటే భయంజాస్తి అయిందిగాని తగ్గలేదు.



ఇట్లాఉండగా సీను వాతో సావాసం ప్రారంభించాడు. పొద్దువనేను బడికి వెళ్లేదాకా మాయింటోనే ఉండేవాడు. సాయంకాలం బడి వదిలిపెట్టిన తర వాత నాతోతిరిగి చీకటిపడ్డాక ఇంటికి పొయ్యేవాడు. వాడుమటుకు బడి పూర్తిగా మానేశాడు.

సీను బడిమానేశాడనే బాధ వాళ్ల మ్మకి లేకపోయింది. గాని నాతో తిరిగి చెడిపోతున్నాడనే బాధపట్టుకుంది.

"తిరగక, తిరగక ఆ బంకరాముడితో తిరుగుతావుట్రా?" అని ఆవిడ



సీనును కోప్పడింది. తనకొడుకు చాలా బుద్ధిమంతుడైనట్టూ, నేనువాణ్ణి చెడగొట్టుతున్నట్టూ అందరితోటీ చెప్పింది. మా అమ్మ నాతో, "నువుచెడిందిగాక వాళ్ల పీనునుకూడా చెడగొట్టుతున్నావా?" అన్నది.

ఎవరెన్ని చెప్పినా సీను నాసావాసం వొదల్లేదు. వాడు బడికిపోవటానికికూడా వొప్పుకున్నాడు.

"నువు బండరాముడి స్నేహం మానితే బడికిపోయినంతఫలం," అన్నది వాళ్ళమ్మ. పీను నాన్నమటుకు సీనులో మార్పుచూసి చాలా సంతోషించాడు.

పీను చాలా శ్రద్ధగా బడికి పోసాగాడు. వాడికి చదువుకూడా బాగా వస్తున్నదని బడిపంతులు చెప్పటం మొదలుపెట్టాడు. సంవత్సరంలోరాని చదువు మూడునెల్లల్లో వచ్చింది. బాల శిక్ష కొన్నారు. అదికూడా నెలరోజుల్లో చదివి పారేశాడు.

పీను ఇప్పుడు చాలా మంచిపిల్లవాడు. వాణ్ణి అందరూ మెచ్చుకునేవాళ్లే. వాళ్లమ్మకూడా, "మావాడు బడికి వెళ్లటం మొదలుపెట్టి ఆ బండరాముడి స్నేహం తగ్గించిన తరవాత చక్కగా బాగు పడ్డాడు, లక్షణంగా చదువుకుంటున్నాడు," అని అందరితోటీ చెప్పింది. సీను నాన్నమాత్రం మూడు రూపాయలుపెట్టి నాకొక ఫౌంటెన్ పెన్ కొనిపెట్టాడు.

నన్నుగురించి ఎవరేమనుకున్నా నాకిప్పుడు విచారంలేదు. కాని పెద్దవాళ్ళు చిన్నవాళ్ళ నర్థంచేసుకుంటే చిన్నపిల్లల జీవితాలు ఇంకా సుఖమయంగా ఉంటాయి. అందువల్ల చిన్నపిల్లల తెలివితేటలుకూడా త్వరగా పైకొస్తాయంటాను. మీరామాట ఒప్పుకోరూ?

[అయిపోయింది]






బ్రాహ్మడు తన అల్లుడైన నక్క బావ దగ్గిరికి వెళ్లి, "నువ్వు, పాపం, నీ ధర్మమా అంటూ నాకు రత్నాల దానిమ్మ చెట్టు ఇచ్చావే గాని నాతో ఆ రహస్యం చెప్పక పోతివి. నన్ను సెట్టీ కమసాలీ కలిసి చాలా ద్రోహంచేశారు. మళ్లీ ఎప్పటిలాగే మేమంతా తిండికి అల్లాడవలిసి వచ్చింది. నీకు పుణ్యం ఉంటుంది, మాకు రత్నాలూ వద్దు, కెంపులూ వద్దు, యింత తిండికి లోపంలేకుండా చేద్దూ!" అని బతిమాలుతున్నాడు.

నక్క బావ ఆలోచించి, "మీకు విలువ తెలియని ఉపకారం చెయ్యటం నాదేతప్పు. ఈసారి ఈ చట్టి పట్టుకుపొండి. దీని మూత తెరిచినప్పుడల్లా మీకు కావలిసిన ఆహారమూ, వంటకాలూ సిద్ధంగా ఉంటూ ఉంటాయి." అని మామగారికి ఒక చట్టి ఇచ్చింది.

బ్రాహ్మడు సంతోషించి ఆ చట్టి పట్టుకుని ఇంటికి వెళ్ళాడు. చట్టి మూత తెరవగానే అందులో కమ్మగా తయారయిన కూరలూ, పప్పులూ, పచ్చళ్లూ, భక్ష్యాలూ సిద్ధంగా ఉన్నాయి. బ్రాహ్మడి సంసారానికి ఆకలిబాధ తీరింది.

కొంత కాలం గడిచాక బ్రాహ్మడి భార్యకు ఒక ఆలోచన తట్టింది.

"మనకు లేనప్పుడు ఒకరికి పెట్టింది లేదు. అల్లుడిగారి దయవల్ల మనకింత తిండి దొరికింది. ఇప్పుడైనా నలుగురినీ పిలుచుకుని ఇంత అన్నదానం చేసుకోక పోతే ముందు జన్మకు పుట్టవద్దా? వండాలా, పెట్టాలా? అన్నిటికీ చట్టఉందె!" అని తన మొగుడిచేత ఊరందర్నీ భోజనాలకు పిలిపించింది.

పేద బ్రాహ్మడు ఊరందరికీ సంతర్పణ చేస్తున్నాడంటే అందరికీ ఆశ్చర్యం కలిగింది. ధనికుల దగ్గిరనుంచీ తేరగా తిందామని వచ్చారు. పొయిలో నిప్పు రాజెయ్యకుండా చట్టి మూతతీసి ఊరందరికీ షడ్రసోపేతంగా ఎక్కతొక్కనట్టు తిండిపెట్టాడు బ్రాహ్మడు. అంతేకాక వచ్చిన అతిథులందరికీ చట్టి మహత్తు



విన్నదానిలో అబద్ధం ఏమీ లేదని తెలుసుకుని రాజుగారు తన నౌకర్ల చేత బ్రాహ్మడి చట్టిని తనవెంట తీసుకు వెళ్లాడు.

మళ్లీ బ్రాహ్మడు యథాస్థితికి వచ్చాడు. రెండోపూట తిండికి లేదు. ఊళ్లోవాళ్లకు సంతర్పణ చెయ్యమన్నందుకు భార్యను తిట్టాడు. భార్యమాట విన్నందుకు తనను తాను తిట్టుకున్నాడు. ఊళ్లో అందరికీ ఈ విషయం తెలిసింది. "నిన్న గొప్పగా అందరికీ విందుచేశాడు. ఇవాళ మింగ మెతుకు లేదు!" అని అందరూ బ్రాహ్మణ్ణి చూసి నవ్వుకుంటున్నారు. ప్రపంచానికి కృతజ్ఞతలేదు.

తప్పేదిలేక బ్రాహ్మడు మళ్లీ అల్లుణ్ణి వెతుక్కుంటూ బయలుదేరాడు. నక్కబావ దారిలో బ్రాహ్మణ్ణి కలుసుకుని సమాచారమంతా విని, "మామగారూ, మీకంటె వెర్రి బ్రాహ్మణ్ణి నే నెక్కడా చూడలేదు. తినటానికింత ఉన్నప్పుడు నెమ్మదిగా ఉండక మీకీ సంతర్పణలూ, గొప్పలూ ఎందుకు? అయినదేదో అయిపోయింది. ఈసారి ఇంకోచట్టి ఇస్తాను. దాన్ని పట్టుకెళ్లి, మీకు అపకారంచేసిన వాళ్లందర్నీ శిక్షించి మీ సొమ్ము రాబట్టుకోండి. ఈ చట్టిలో తాడూకర్రా ఉన్నాయి. మూతతీసినప్పుడల్లా అవి పైకివచ్చి మీరు కట్టి

చెప్పి, దాన్ని తనకిచ్చిన తన అల్లుడి గొప్పతనంకూడా వేనోళ్ళ అందరిముందూ పొగడాడు.

బ్రాహ్మడి సంతర్పణలో భోంచేసిన వాళ్లలో రాజుగారింట భోజనాలుచేసిన గొప్పవాళ్లున్నారు. వాళ్లు రాజుగారిదగ్గిరికి పోయి, "మహారాజా, ఏమని చెప్పం! మనఊళ్ళో ఉన్న ఒక బీదబ్రాహ్మడిదగ్గిర ఒక చట్టిఉంది. దాని మూత తీసినప్పుడల్లా అందులోనుంచి అత్యద్భుతమైన వంటకాలు వస్తాయి. వాటిముందు నలభీమ పాకాలెందుకు? అది నిజంగా తమ లాటి ప్రభువులదగ్గిర ఉండదగిన చట్టిగాని పేద బ్రాహ్మడిదగ్గిర ఉండదగినది కాదు. ఆ బ్రాహ్మడూ రోజూ సంతర్పణలు చెయ్యగలడు. అప్పుడు మీ విందుల కెవరు వస్తారు?" అని చెప్పారు.

రాజు వాళ్లమాటలు వెంటనే నమ్మక బ్రాహ్మడి యింటికి చట్టిని చూడటానికి స్వయంగా బయలుదేరి వెళ్ళాడు. తాను

వెయ్యమన్నవారిని కట్టివేసి కొడతాయి," అని చెప్పింది నక్కబావ.

బ్రాహ్మడా చట్టిని బుజాన పెట్టుకుని వీధిలోనుంచి వస్తూ కనపడ్డవారితోనల్లా, "ఒక చట్టి పోతే ఇంకో చట్టి!" అని చెబుతూ ఇల్లు చేరుకున్నాడు. మర్నాడు బ్రాహ్మడు మళ్లీ ఊరంతా తిరిగి, "మీరంతా మాయింటికి దయచెయ్యాలి. మా కొత్త చట్టి ప్రభావం చూసితీరవలిసిందే గాని చెప్పనలవికాదు," అని పిలిచివచ్చాడు.

వెనకటిలాగే ఊరంతా బ్రాహ్మడింటికి వచ్చారు. బ్రాహ్మడి ఆహ్వానం అందుకుని రాజుగారుకూడా వచ్చారు. అందరూ పంక్తులుతీరి కూర్చున్నారు. రాజుగారికి ఉన్నతాసనం వేశారు. బ్రాహ్మడు చట్టి తెచ్చి మధ్యపెట్టి మూతతీసి, "అందరికీ తిన్నన్ని వడ్డించు!" అన్నాడు. వెంటనే చట్టిలోనుంచి అంతులేని తాడు బయటికి వచ్చి అందర్నీ గట్టిగా కట్టేసింది. కర్ర వచ్చి ఒక్కొక్కరినే చచ్చేటట్టు కొట్ట సాగింది. అందరూ కుయ్యో, మొర్రో అని ఏడవసాగారు.

రాజుగారి వంతు వచ్చినప్పుడు బ్రాహ్మడు, "నా చట్టి నాకిస్తావా?" అని



అడిగాడు. దెబ్బలబాధకు తట్టుకోలేక రాజుగారు వెంటనే తన భటులను పిలిపించి చట్టి బ్రాహ్మడికి ఇప్పించాడు.

సెట్టివంతు వచ్చింది. కర్రను చూస్తుండగానే సెట్టి పై ప్రాణాలు పైనపోయినాయి. "నా రత్నాల రాసులన్నీ నాకు తిరిగి ఇచ్చివేస్తావా?" అన్నాడు బ్రాహ్మడు. సెట్టి, "ఇస్తాను బాబో", అని ఏడిచాడు. కమ సాలినికూడా బ్రాహ్మడు శిక్షించి తనను దోచుకున్నవారికీ, వేళాకోళం చేసినవారికీ కూడా బాగా బుద్ధి చెప్పాడు.

బ్రాహ్మడి కష్టాలు గట్టెక్కాయి. ఇప్పుడు బ్రాహ్మడు పూరిగుడిసెలో ఉండటంమానేసి అష్టఐశ్వర్యాలతోనూ తులతూగుతున్నాడు.

అయితే బ్రాహ్మడికి ఒక అనుమానం తట్టింది. "మనకింత ఉపకారం చేసిన అల్లుడు సామాన్యమైన నక్క కాదు. ఇందులో ఏదో రహస్యం ఉండాలి. అదేమిటో తెలుసుకుందాం," అని బ్రాహ్మడు తన కుటుంబంతో సహా నక్కబావ వుండే చోటు వెతుక్కుంటూ బయలుదేరాడు.

నక్కబావ ఉంటున్నది ఒక రహస్యమైన గుహ. బ్రాహ్మడు సకుటుంబంగా అక్కడికి వెళ్ళాడు. అదివరకల్లా తన ఇల్లు తెలియకుండా దాచిపెట్టిన నక్కబావకు ఇప్పుడు మామగారిమీద అభిమానం కలిగి గుహలోపలికి తీసుకుపోయింది.

గుహలోపల పెద్ద భవనం వుంది. అంతటా దీపాలు వెలుగుతున్నాయి. ఎక్కడచూసినా రత్నాలే. ఇవిచూసి అందరూ ఆశ్చర్యపడ్డారు. నక్కకు ఇటువంటి ఇల్లు ఎల్లా వచ్చిందీ ఎవరికీ తెలియదు.

అయితే నక్కబావ రహస్యం బ్రాహ్మడి కడసారి కూతురు కనిపెట్టింది. అతనొక రాజకుమారుడు. అతనికి నక్కలాగా సంచరించటం సరదా. అందుచేత బయటికి వచ్చినప్పుడు నక్క శరీరంలో పరకాయప్రవేశంచేసి తిరుగుతూ వుంటాడు. తన గుహలోకి వెళ్ళినప్పుడు మామూలు మనిషి అయిపోయి నక్క శరీరాన్ని భద్రంగా దాస్తూవుంటాడు. ఇది కనిపెట్టి బ్రాహ్మడి ఆఖరు కూతురు, తన బావగారు స్నానంచేస్తూవున్న సమయంలో నక్క శరీరాన్ని కాస్తా కాల్చివేసింది.

అంతటితో నక్కబావ కథ కంచికి వెళ్లింది మనం ఇంటికివచ్చాం.





# అత్తా కోడళ్ల కథలు

అనగా అనగా ఒకఊళ్లో ఒక పెద్దమ్మ ఉన్నది. ఆమెకు ఒక్కడే కొడుకు. అతనికి యుక్తవయస్సు రాగానే మంచి అందమైన మయిన పిల్లనుచూసి పెళ్లి చేసింది.



కొంతకాలం పోయిన తరువాత కోడలు కాపరాని కొచ్చింది. అప్పుడు కోడలు అత్తతో అన్నదిగదా "అత్తా, అత్తా! నీ కోడలు కాపరాని కొచ్చింది గదా! యిక నువ్వు చచ్చిపో అత్తా. యింటిపనులన్నీ నీ కోడలి నైన నేను చూచుకుంటా లే" అని. అప్పుడు అత్త "ఒసే, నీకడుపున ఒక్క కాయ కాస్తే చూసిపో దామనిఉందే అన్నది. యిక కోడలు చేసేదిలేక "ఓసి యీా ముసలిముండ పడిచావ" అని మనసులో తిట్టుకుంది.

సరే కొంతకాలము జరిగిన తరువాత పెద్దమ్మకు ఒక మనమడు పుట్టాడు. అప్పుడు కోడలు అత్తతో "నాకు కొడుకు పుట్టితే



చూచావుగదా! యిక చచ్చిపో అత్తా" అన్నది. అప్పుడు అత్త "కాస్త వాడి ముచ్చట్లు చూడవద్దులే. వాడిని బళ్లో వేసిన తరువాత పోతాలే" అన్నది.



కొంతకాలానికి మనవడ్ని బళ్లోవేశారు. అప్పుడు అత్తని కోడలు పొమ్మంటే అత్త అన్నదిగదా "కాస్త వాడికి దంజప్పొగు వేసిన తర్వాత పోతాలేవే" అంది.

శేఖర్, మారీసుపేట, తెనాలి



కొంత కాలానికి మనవడికి వడుగుకూడా చేసారు. అప్పుడు కోడలు పొమ్మంటే



అత్త "కాస్త వాడ్ని ఒక యింటివాడ్నిచేస్తే చూసి పోతానే" అని సాకు చెప్పింది.

కోడలు కొడుకుకు తొందరగా పెళ్లిచేసి "ఇక పోవా, అత్తా!" అని అడిగింది.

అప్పుడు కోడలితో అత్త "కాస్త మనవడూ, వాడి పెళ్లామూ కలిసి కాపరం చేస్తూంటే చూసిపోతానే" అన్నది.

సరే కొంతకాలానికి మనవడి పెళ్లాము కాపరానికొచ్చింది. అప్పుడు కోడలు పొమ్మంటే అత్త "నీకు కూడా కోడలొచ్చిందిగదే. ఇంటిపనులు అది చూస్తుంది లేవే. నువ్వుకూడా రావే యిద్దరం పోదాము" అన్నది.

ఇప్పుడు కోడలికి పెద్ద చిక్కొ వచ్చింది. యిది తప్పించుకోవటం ఎట్లాగా అని ఆలోచించి ఆలోచించి చివరికిపోయి అత్తతో దొంగ ఏడుపు ఏడుస్తూ "అత్తా అత్తా, నీవు పోతానంటే నా కడుపులో గుబగుబ లాడుతున్నది, ఏడుపువస్తున్నది. నీవు పోవద్దులే అత్తా" అన్నది.

అత్త ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ మనస్సులో తన తెలివికి



మెచ్చుకుంటూ "సరేలేవే మరి నేవుంటే నాకు చాకిరీ చేసేవాళ్ళు ఉండద్దా. నువ్వు నేను చెప్పిన వనల్లా నాకుచేస్తానంటే ఉంటా" అన్నది. అప్పుడు కోడలు మనస్సులో "అమ్మయ్య బ్రతికాను" అనుకుని అప్పటినుంచి అత్త చెప్పినట్లలా వింటూ ఉన్నది.






కృష్ణదేవరాయలవారి తల్లికి జబ్బు చేసి మంచాన పడింది. రోగం ఆ రోజు కా రోజుకీ ముదిరిపోతోంది. చివరికి ఇక బతకననే అనుమానం కలిగింది రాయలవారి తల్లికి. అప్పుడామెకి మామిడిపండ్లు తినాలని మనసైంది. తనకోరిక రాయలవారితో చెప్పింది.

కాని అది మామిడిపళ్ళు దొరికే కాలంగాదు. ఎలాగైనా తనతల్లి ఆఖరి కోర్కె తీర్చాలని రాయలవారు మంత్రుల్ని మామిడిపళ్ళు తెమ్మని దేశం నాలుగుమూలలకూ పంపారు. కాలం గాని కాలంలో మామిడిపళ్ళు ఎక్కడ దొరుకుతై? వాళ్ళు తిరిగి తిరిగి ఒట్టి చేతుల్తో తిరిగి వచ్చారు. వాళ్లొచ్చేసరికి రాయలవారితల్లి కాస్తా చనిపోయింది.

"కనీసం నాతల్లి ఆఖరి కోరికైనా తీర్చలేకపోయాను గదా" అని రాయలవారు విచారంగా ఆలోచిస్తూ కూచున్నారు. అప్పుడు కొంతమంది పురోహితులు రాయలవారి దగ్గిరికివచ్చి "ఏలినవారు అంతగా విచారించాల్సిన పనిలేదు. శాస్త్రాల్ని అనుసరించి తమరు వేయిమెనమండుగురు బ్రాహ్మణులకు బంగారు మామిడిపళ్ళు దానం చెయ్యవచ్చు. దానివల్ల తమ తల్లిగారి మనసులో కోరిక తీరుతుంది, ఆత్మకు శాంతి గలుగుతుంది" అని సలహాయిచ్చారు. సరే వాళ్ల సలహా ప్రకారం పదోరోజున ఆ దానం చెయ్యటానికి అన్నీ సిద్ధంగావుంచమని రాయలవారు ఆస్థానంలో చెప్పారు.



రామలింగానికి ఈ బ్రాహ్మలు రాయలవారిసొమ్ము తేరగా కాజెయ్యాలని ఈ సలహా యిచ్చారని చాలా ఉక్రోషం వచ్చింది. ఎలాగైనా వాళ్ళకి తగిన శాస్తి చెయ్యాలనుకున్నాడు.

పదోరోజు వచ్చింది. 1008 బంగారు మామిడిపళ్ళు సిద్ధంచేయించారు రాయలవారు. బ్రాహ్మలు దానం పొందటానికి రాయలవారిదగ్గిరికి వస్తున్నారు. వాళ్ళు వచ్చే దారిలో మన రామలింగం ఒకకుంపట్లో యినప కడ్డీలు కాలుస్తూ కూచున్నాడు. మొదటి బ్రాహ్మడు పోతుండగా రామలింగం పిలిచి "యిదిగో, యిది ఒకటి వేయించుకు పొండి" అన్నాడు ఎర్రగా కాల్చిన యినపకడ్డీ చూపిస్తూ. పాపం, బ్రాహ్మడు తెల్లబోయి "యిదెందుకు?" అని అడిగాడు. "ఎందు కేమిటి! అక్కడ దానం పొందదలిచిన వాళ్ళందరూ ఇక్కడ ఒక్కోవాత పెట్టించుకు పోవాలి. దానం అక్కర్లేదు, వాత అక్కర్లెదు అంటే నే చెప్పేదిలేదు. కాని వాత



పెట్టించుకు పోతేగాని మీకు మామిడిపండు దానం ఇవ్వరు. తర్వాత మీయిష్టం" అన్నాడు.

ఇది వినేసరికి బ్రాహ్మల కందరికీ చాలా ఆశ్చర్యం వేసింది. చూస్తూ చూస్తూ వాతలు వేయించు కోటానికి వాళ్ళకి మనసొప్పలేదు. కాని బంగారు మామిడిపళ్ళ ఆశవల్ల అంతా ఒక్కొక్కరే ఒక్కో వాత వేయించుకుని ఆ వాతలు కనపడకుండా ఉత్త రీయాలు కప్పుకుని రాయలవారి దగ్గిరికిపోయారు.

వాళ్ళల్లో ఒక దురాశపోతు రామలింగం చెవిలో "నాకు రెండు దయచేయించాలి" అని కోరాడు. "సరే అలాగే కానివ్వు" అంటూ రామలింగం ఆ బ్రాహ్మడికి రెండువాతలు పెట్టి పంపించాడు. అతనూ రాయలవారి దగ్గిరికిపోయాడు. అందరితోపాటు రాయల వారు ఈ బ్రాహ్మడికికూడా ఒక బంగారు మామిడి పండు ఇచ్చారు. పాపం బ్రాహ్మడు, తను రెండు వాతలు వేయించుకున్న సంగతి రాయలవారికి తెలియక



ఒకపండే యిచ్చారనుకుని పైవుత్త రీయం తీసి రెండువాతలూ చూపిస్తూ రెండువేళ్ళు చూపెట్టాడు.

'ఈరెండు వాతలేమిటి?' అన్నారు రాయలవారు.

"చిత్తం, రామలింగంగారి దయ. నాకోరిక ప్రకారం రెండువాతలువేసి రెండుపళ్ళు దానం తెచ్చుకోమన్నారు." అన్నాడు. రాయలవారికి ఒకేసారినవ్వూ కోపం రెండూ వచ్చాయి. "ఏడీ పిలు, ఆ రామలింగాన్ని" అని భటుల్ని పంపించారు.

రామలింగం రాయలవారి ఎదటికి వచ్చి నిలబడ్డాడు. రాయలవారు "వాళ్ళకావాతలు పెట్టమని ఎవరు చెప్పారు నీకు" అని అడిగారు.

"ఎవరూ చెప్పలేదు. మాతల్లిగారు కూడా ఈమధ్యనే చనిపోయింది. ఆమె పక్షవాతంతో బాధపడుతూ, చనిపోయే ముందు 'నాయనా, నాకు వాతలన్నా పెట్టరా ఈబాధ పోతుంది' అనికోరింది. సరేగదా నని నేను కడ్డీలుకాల్చి తెచ్చే లోపలనే ఆమెగారు చనిపోయింది. నా తల్లి ఈ ఆఖరికోర్కె తీర్చలేకపోయి నందుకు నేనెంతో విచారిస్తున్నాను. ఇంతలో ఏలినవారి తల్లిగారు చని పోయారు. వారి తుది కోర్కె తీర్చ టానికి పురోహితులు శాస్త్ర ప్రకారం ఆలోచించి గొప్ప సలహా యిచ్చారు. అదృష్టవశాత్తూ ఆసలహా నాకూ వుపయోగపడుతుంది గదా అని సంతోషించాను. సందడిలో సందడి, నేను కూడా వాతల దానం యిచ్చుకోటానికి ఈ అవకాశం ఉపయోగించుకున్నాను" అన్నాడు రామలింగం.

రాయలవారికి బ్రాహ్మలు తనను మోసం చేశారని తెలిసి చాలాకోపం వచ్చింది. రామలింగం తెలివికి చాలా సంతోషంకూడా కలిగింది. దానం పొందిన బ్రాహ్మలందరిచేతా వాళ్ళ వాళ్ళపళ్ళు తిరిగి రామలింగానికి బహుమానంగా యిప్పించారు.



# కాకీ పిచికా

వేదాంతం నళినీ రాజ్యలక్ష్మి, గుంటూరు

ఒకనాడొక కాకీ ఒక పిచ్చికా కలిసి పాయసం వండుకున్నాయి. స్నానం చేసి వచ్చి పాయసం తిందా మన్నది పిచ్చిక. పిచ్చిక పోయి తన కొలనులో స్నానం చేసింది. కాకి కూడా అందులోనే స్నానం చెయ్యబోతే ఒప్పుకోక, "దుప్పికొమ్ము తెచ్చి నీ కొలను నువ్వే తవ్వుకో," అన్నది పిచ్చిక.



కాకి దుప్పిదగ్గిరికి వెళ్లి, "పిచ్చికా నేనూ పాయసం వండుకున్నాము. పిచ్చిక తన కొలనులో నన్ను స్నానం చెయ్యవద్దన్నది. కొలను తవ్వుకొంటాను, కాస్త నీ కొమ్ము ఇయ్యవూ?" అని అడిగింది.

"నాకు అవుపాలు తెచ్చి పెట్టు, కొమ్మిస్తాను," అన్నది దుప్పి.

కాకి అవుదగ్గిరికిపోయి, "పిచ్చికా నేనూ పాయసం



వండుకున్నాము. పిచ్చిక తన కొలనులో నన్ను స్నానం చెయ్యవద్దన్నది. కొలను తవ్వుకోటానికి దుప్పి కొమ్మిస్తానన్నది. దుప్పి కివ్వటానికి కాసిని పాలియ్యవూ?" అన్నది.

"నాకు ఇంత పచ్చిగడ్డి తెచ్చిపెట్టు, పాలిస్తాను," అన్నది అవు.

కాకి పొలానికి వెళ్లి, పిచ్చికా నేనూ పాయసం వండుకున్నాము. పిచ్చిక తన కొలనులో నన్ను స్నానం చెయ్యవద్దన్నది. కొలను తవ్వటానికి దుప్పి కొమ్మిస్తానన్నది. అవు దుప్పికి పాలిస్తానన్నది. అవుకివ్వటానికి కాస్త గడ్డి



ఇవ్వవూ?" అన్నది

"దానికేం భాగ్యం, తల్లీ! పార తెచ్చి తవ్వుకో," అన్నది పొలం.

కాకి కమ్మరివాడిదగ్గిరికి పోయి, "పిచ్చికా నేనూ పాయసంవండుకున్నాము. పిచ్చిక తన కొలనులో నన్ను స్నానం చెయ్యవద్దన్నది. కొలను తవ్వుకోటానికి దుప్పి కొమ్మిస్తా



నన్నది. అవు దుప్పికి పాలిస్తా నన్నది. పొలం అవుకు గడ్డియిస్తా నన్నది. గడ్డి తవ్వుకోవటానికి పార యియ్యవూ?" అన్నది.

"పార యిస్తానుగాని కాస్త నా కొలిమి ఊది పెట్టు," అన్నాడు కమ్మరి.

కాకి కొలిమి ఊదబోయి అందులో పడి చచ్చిపోయింది.

పిచ్చిక పాయసమంతా తానే తినేసింది.




గోపాలకృష్ణమ్మ గోవుల్లవెలుగు
మాచిన్నకృష్ణమ్మ మాకళ్లవెలుగు
చక్కచక్కనివాడు, చదువుకుంటాడు
అల్లరీచేస్తాడు, ఆడుకుంటాడు
ఊరెళ్లివస్తేను ఊరికేరాడు
పాపాయి కొక్క అప్పచ్చితెస్తాడు.

* *

శ్రీరామచంద్రుండు శీలవంతుండు
వీరాధివీరుడై విలసిల్లినాడు.
మాయింటనున్నాడు బండరాముండు
పిల్లలందరిలోన వీరుడేవాడు.
అమ్మచెప్పినమాట అంతగా వినడు
నాన్నచెప్పినమాట ఎన్నడూవినడు.
ఆమాట ఈమాట అమ్మతోచెప్పి
అటుచూచి ఇటుచూచి అప్పచ్చితెచ్చి,
బామ్మదగ్గరచేరి పలుమాటలాడి
కాయైన పండైన కాజేసితెచ్చి,
చిటికలో తింటాడు చీల్చిచెండాడి.

చదువనూవ్రాయనూ చాతకాదమ్మ.
బడిలోకిపొమ్మని బ్రతిమాలితేను
రోజురోజల్లాను రోజుతుంటాడు.
పాపాయిపొడరు పంతమ్ముపట్టి
పూటపూటకుకూడ కోటాలుకొట్టి
మంచిబట్టలుకట్టి మాప్పుతుంటాడు.
మట్టిలోనేఆట మహమంకుపట్టు
తిండికి మెండమ్మ, మొండమ్మ పనికి.
నల్లనల్లనివాడు నగుమోమువాడు
నల్లవాడంటేను గొల్లుమంటాడు.
మధురాతి మధురాలు మాటలూపాట
రాంబాబు మాఇంట రాణించుచుండు.

* *

సీతామహాదేవి స్త్రీలలోవెలుగు
చిన్నారి మాసీత చిట్టిమాసీత
కనకంపుబొమ్మ మా కళ్లలోవెలుగు
సీతమ్మనవ్వితే కిలకిల్లవెలుగు
సీతమ్మ యేడిస్తె చిమ్మచీకట్లు.

కాశిరాజు రామమోహనశర్మ, జబ్బల్‌పూర్

# నల్లి పుట్టుక

అనగా అనగా ఒకడుండేవాడు. ఒక బ్రాహ్మడు. పాపం అతను చాల పేద వాడు. అందుకని యాయవారా లెత్తు కొని యిల్లు గడుపుకొనేవాడు. దరిద్రుడి పెళ్లికి వడగళ్ల వాన అన్నట్టుగా అతనికి ముగ్గురు కూతుళ్ళు పుట్టారు. పెద్దదాని పేరు పేరమ్మ. రెండోదాని పేరు అంకమ్మ. మూడోదానిపేరు ముత్యా లమ్మ, ఈ ముగ్గుర్ని ఆ ముసలి బ్రాహ్మడు కష్టపడి పెంచి పెద్దవాళ్లను చేశాడు. ముగ్గురూ చాల అందంగా ఉండేవాళ్ళు. అందువల్ల వాళ్ల ముగ్గురికీ మంచి సంబంధాలు వచ్చాయి. ముసలి బ్రాహ్మడు పెద్దమ్మాయిని ఒక కరణా నికి, రెండో అమ్మాయిని ఒక అగ్ర హారికుడికి, మూడో అమ్మాయిని ఒక జమీందారుకు యిచ్చి చెరవదల్చు కొన్నాడు.

బంగారంలాటి కాపురాలు ఏర్పడ్డా ఆ ముగ్గురి పిల్లలకీ సంతృప్తి లేక పోయింది. ఒకసారి శ్రావణ శుక్రవారం వచ్చింది. పేరమ్మయింట్లో అన్నీ పనులూ అయిపోయాయి. పేరమ్మ అత్త ముసలిదే అయినా ఆనాడు చీకటితో లేచి అన్ని పనులు చేసింది. కోడలికి తానే తలంటిపోసి, వెంద్రుకలుఆర్చి చిక్కుదీసి, దువ్వి జడవేసింది. వంట కూడాచేసి కొడుకూ కోడలికి వడ్డిం చింది. ఇంకా ఎన్ని పనులున్నాయో అన్నీ అత్తేచేసింది. ఆ పనులతో ప్రొద్దుగూకింది. అత్త పేరమ్మ దగ్గ రకువెళ్ళి "అమ్మాయీ, అమ్మాయి కాస్త దేవుడిదర్శనం చేసుకొస్తాను. తిల్లిక పెట్టమ్మా." అని చెప్పిపోయింది.

ఈమాటతో పేరమ్మకు ఒళ్ళు బగ్గున మండింది. "అన్నింటికీ నేనే



చేయాలి! పోయేముండ తిల్లిక పెట్టి పోగూడదూ. ఈ వెట్టి చాకిరి ఎవరు చేస్తారు! మా అమ్మఅయితే యిలా చేసేదా. ఈ కాపురం బుగ్గిగాను." అని పేటుకు పేటుకున మెటికలు విరిచి పోసి పుట్టింటికి బయలుదేరింది.

దారిలోనే అంకమ్మగారి ఊరు కూడా. పోతూ పోతూ పేరమ్మ చెల్లెలియింటికి వెళ్లింది. చెల్లెలు అంకమ్మకు తన కష్టాలన్నీ చెప్పుకొని ఏడ్చింది.

అంకమ్మ పేరమ్మను ఓదారుస్తూ అక్కా అక్కా, అలా అంటున్నావు నా చెర ఎవరికి చెప్పుకోను! నీకు అత్తముండ తగలాఏమైంది. నాకు అలాకాదే. కట్టుకొన్న మొగుడే నాపాలిటి యముడయాడు. నిన్నగాక మొన్న నే ఒక బంగారపు గొలుసుతెచ్చి మెళ్లో వేశాడు. అది ఎంత బరువు ఉందనుకొన్నావు అక్కయ్యా! ఏదో సంతోషిస్తాడని అంత బరువు వేసుకొని మోశాను. ఎంత కసాయిగుండే! అలా ఊరుకున్నాడు కాని, అఃసిపోయిందే అని కాస్త విసనికర్ర పట్టుకొని విసిరిన పాపాన పోలేదు. రామరామ ఏ జన్మనక్షత్రంలో పుట్టాడో జాలి అనేది ఏ కోశాన లేదుగదా. ఇలాంటి మొగుడితో కాపరం చేసే దెలాగే. ఇక లాభంలేదు అమ్మదగ్గరకు వెళ్ళుదామా అనుకొంటున్నాను. ఇంతలో నువ్వు వచ్చావు." అన్నది.



ఇక గడియకూడా ఉండగూడదనుకొని యిద్దరు అక్కచెల్లెండ్రు కలిసిబయలుదేరారు. దారిలోనే ముత్యాలమ్మ ఊరుకూడా ఉంది. పేరమ్మా అంకమ్మా యిద్దరూ చెల్లెలి యింటికెళ్లారు. తీరా లోపలికి వెళ్లి చూస్తే తలకు వాసెనగట్టుకొని ముత్యాలమ్మ ఏడుస్తూవుంది. అక్కలిద్దరూ చెల్లెలితో గలిసి ఏడ్చి చివరికి కారణ మడిగారు. వెక్కి వెక్కి ఏడుస్తూనే ముత్యాలమ్మ "ఏమికాపురమే దిక్కు మారిన కాపురం. నిన్నరాత్రి వెన్నెల్లో ఆయన నేను తోటలోకి వెళ్లాము. నేను ఆయన తొడమీద తలపెట్టుకొని పడుకొన్నాను. గాలికి పారిజాతం పువ్వులు నాలుగు రాళ్ళు రువ్వినట్టుగా వచ్చి నామీద పడ్డాయి. ఆయన చూసీ చూడనట్టుగా ఊరుకున్నాడుకాని "అన్నిపూలు ముఖాన పడ్డాయే దెబ్బ తగిలిందా" అనికూడా అడిగిన పాపాన పోలేదు. ఇలాంటి మొగుడితో కాపరంచేసేకన్నా గంగలో



దూకితే మంచిది. ఇక్కడ ఒక్క క్షణం కూడా ఉండగూడదు. అమ్మగారింటికి వెళ్ళుదామని అనుకొంటూ వున్నాను. ఇంతలో మీరు వచ్చారు" అన్నది.

ఇక ఉండగూడదంటే ఉండగూడదనుకొని ముగ్గురు అక్కచెల్లెండ్రు బయలుదేరి పుట్టింటికివెళ్ళి అమ్మకు తమ కష్టాలు చెప్పుకుని బావురున ఏడ్చారు. అప్పుడు వాళ్లమ్మ యిలా అంది: "నా అల్లుళ్లే కాస్తలో కాస్తన్న నయం. మీ నాన్నవంటివాడు భూలో





కంలో యిక పుట్టబోడు పెరగబోడు. మొన్నగాక మొన్న యాయవారానికి వెళ్ళి గిద్దెశంచే గిద్దెడు బియ్యం తెచ్చాడు. అందులో ఇన్ని పప్పుపోసి రొట్టెలు కాలుద్దామని పొయ్యిదగ్గర కూర్చున్నాను. ఆయన స్నానానికి వెళ్లాడు. నేను మూడే రొట్టెలు కాల్చాను. ఉప్పు చాలిందా లేదాఅని చూచేటప్పటికి ఒకటి అయిపోయింది. కాలిందోలేదో అని చూచేటప్పటికి రెండోది అయిపో యింది. ఆయన వచ్చిందాక చేతులు



ముందేసుకొని ఎలా కూర్చునే... ఆయన వచ్చేటప్పటికి మూడోదికూడా అయిపోయింది. మీనాయన మట్టుకు మీనాయన గుడ్లప్పగించి చూచాడేకాని "అయ్యో! అన్ని రొట్టెలు తిన్నావు కామాలు కడుపునొప్పి ఇచ్చిందా? మందు తెచ్చేదా అన్న పాపానకూడా పోలేదు."

తల్లీ కూతుళ్ళు నలుగురు పెద్దగా శోకాలు మొదలెట్టారు. ఈ ఏడుపువిని మహేశ్వరుడికి ఎక్కడలేని కోపంవచ్చి "ఇన్ని భోగాలిస్తేనే ఇంకా ఏడుపు దేనికి. మీరు సుఖపడరు. ఇంకో శోకిస్తే మీకు సంతోషం. ఇలాంటివాళ్ళు నా సృష్టిలోనే ఉండగూడదు. మీరు నల్లులై పుట్టండి," అని శపించాడు.

ఆ శాపంవల్లనే మనకు నల్లులు వచ్చాయి. వాటి పూర్వజన్మలో తల్లీ కూతుళ్ళు కావటంవల్ల మన నెత్తురు పీల్చినా వాటికి సంతృప్తిలేదు. ఇంకా కుట్టి బాధిస్తూనే వుంటాయి.





# తండ్రీ కొడుకులు



గత సంచిక తరువాయి

వంటలక్కకి పిల్లవాడిమీద జాలి వేసింది. యిప్పుడా పిల్లవాడు తన యజమాని అయిన సూరయ్యేనని ఆవిడకు తెలీదు. "పాపం, పసివాడు కడుపునొప్పి వంకపెట్టి బడి ఎగకొడితే తండ్రి వాడికి ఫలహారంలేకుండా చెయ్యాలా? వాడికేదైనా ఒకముక్క పెడదామన్నా పెద్దాయన పెళ్ళికూతురల్లే పైకివెళ్లి కూచున్నాడు. బయటికిపోడు" అనుకొన్నది.

ఇంతలో వంటలక్కకు ఇంటో బియ్యమూ, యితర సామానులూ కావాలనేది జ్ఞాపకం వచ్చింది. అందుచేత ఆవిడ పైకి వెళ్లి తన యజమానితో, "పొద్దుననగా బియ్యం తేవాలని చెప్పాను. ఇంకా తీసుకురాలేదు. బియ్యంతోపాటు మిగిలిన వస్తువులన్నీ తెచ్చి పడెయ్యండి. ఇవాళో రేపో తేవలిసినవే," అన్నది.

ఈమాట వినగానే సూరయ్యరూపంలో వున్న సత్యం "హి, హి, హి," అని నవ్వాడు. తరవాత నవ్వు ఆపుకుని, "ఓ, ఫస్టుగా తెస్తాను," అన్నాడు. ఎంతో గంభీరంగా ఉండే సూరయ్య ఇట్లా నవ్వటమూ, పసిపిల్లవాడల్లే మాట్లాడటమూ వంటలక్కకు వింతగా తోచింది. కాని దాన్నిగురించి ఆవిడ ఆలోచించలేదు. సత్యం కుర్చీలో నుంచి లేచి తన జేబులో వున్న తాళపు చెవులతో బీరువా తెరిచి అందులోవున్న నోట్లన్నీ చాలాసేపు ఎంచుకుని. చాలా నోట్లు జేబులో పెట్టుకుని బయటికి బయల్దేరాడు.

తన యజమాని గడపదాటగానే వంటలక్క "సత్యం. సత్యం!" అని పిలిచింది. కాని ఎక్కడా సత్యం అలికిడిలేదు. తండ్రి ఇంటోలేని సమయాల్లో సత్యం ఎక్కడున్నా చుట్టుపక్క ఇళ్లకుకూడా సందడిగా వుండేది. అటువంటిది ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

"సత్యం, సత్యం," అంటూ వంటలక్క యిల్లంతా వెతికింది. చివరకు సత్యం వాళ్ల నాన్నగారి ఆఫీసుగదిలో ఇల్లముందర పెద్ద కుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు.

"ఎన్ని పిలిచినా పలకవేం?" అన్నది వంటలక్క.



సూరయ్య ఉలికిపడి, తలఎత్తిచూచి, మొహం చిట్లించి "నన్నిట్లా తగులుకున్నావేం? పోయి నీపని చూసుకో," అన్నాడు.

"నే చెబుతున్నా, ఇది నీ మంచికి రాలేదు. రానురాను నీకు ఈడుమించిన మాటలూ, వేషాలూ వస్తున్నాయి," అంటూ వంటలక్క లోపలికి వెళ్లి, ఒక పళ్ళెంలో గారెలూ అవడలూ తెచ్చి బల్లమీద పెట్టింది.

వాటిని చూడగానే సూరయ్యకు మొదట భయంవేసింది కాని కడుపులో దహించుకుపోతున్నట్టు అనిపించి అవురావురుమని వాటిని ఫలహారం చేసేశాడు. సూరయ్య నీరసమంతా పోయింది. కడుపులో నొప్పి రాకపోగా వొంటో ఎంతో ఉత్సాహం వచ్చింది.

తనలోకలిగిన మార్పునుగురించి ఈ క్షణంవరకూ సూరయ్యకు విచారమే కలుగుతూ వచ్చింది. కాని ఇప్పుడు ఇందువల్ల కొన్ని మేళ్లుకూడా కనిపించసాగాయి. ఎన్నాళ్లనుంచో బాధిస్తున్న అజీర్తి బాధ విరగడయి పోయింది. కొంతకాలంపాటు హాయిగా యిష్టంవచ్చినదల్లా తినవచ్చు. శరీరం తేలికయింది కనక చక్కగా ఎగరవచ్చు, గంతులువెయ్యవచ్చు. కొంత కాలంపాటు వ్యవహార చిక్కులుకూడా వొదిలించుకుని తిరగవచ్చు. ఈ విషయాలన్నీ చూసుకుని సూరయ్య కొంతవరకు సంతోషించాడు.

సత్యానికికూడా తన స్వరూపం మూరటంగుపించి విచారం తగ్గసాగింది. వాడు దర్జాగా నోట్లకట్టలు జేబులోపెట్టుకుని నేరుగా వెచ్చాల అంగడికి వెళ్ళాడు. షావుకారు సుబ్బయ్యతో ఏవిధమైన బేరమూ ఆడలేదు. వంటలక్క చెప్పిన సరుకులన్నీ కూలివాడి నెత్తిన ఎత్తించుకున్నాడు. సుబ్బయ్య చెప్పినంత డబ్బు యిచ్చేశాడు. వస్తూ వస్తూ దారిలో కొన్ని గాజు గోలీలూ, ఒక దసరా కోతిబొమ్మా కొనుక్కున్నాడు.

దారిలో అనేకమంది పెద్దవాళ్లు కనిపించి, "నమస్కారం. పంతులుగారూ," అంటూ వచ్చారు. తనకే నమస్కారం





పెడుతున్నారని సత్యం మొదట గ్రహించలేదు. కాని ఆవిషయం తెలుసుకున్నాక చాలా సంతోషించాడు. వాళ్లందర్నీ చూసే అవకాశం కలిగినందుకు సత్యానికి నవ్వు కూడా వచ్చింది. సత్యాన్ని పలకరించిన వాళ్లలో కొందరు వాడికి తెలిసినవాళ్లే కాని కొందరు బొత్తిగా కొత్తవాళ్ళు. వాళ్ళు తనను నిలబెట్టి మాట్లాడిస్తారేమో నని సత్యం చాలా భయపడ్డాడు. కాని అదృష్టవశాత్తూ ఆపూటకు అటువంటిదేమీ జరగకుండానే వెళ్లిపోయింది.

సత్యం ఇంటికి తిరిగివచ్చేసరికి చీకటి పడింది. దీపాలుపెట్టారు. వాళ్ల ఇంటి ముందు చీకట్లో నిలబడి ఒక కుర్రవాడు గట్టిగా ఈలవేస్తున్నాడు. సత్యం ఒళ్ళు ఒక్కసారి పొంగిపోయింది. ఆ యీలవేసే వాడు రంగడు. తనుకూడా జవాబుగా యీలవేయటానికి ప్రయత్నించాడు. కాని ఎంత ప్రయత్నించినా యీల రాలేదు. సత్యానికి భలే కోపంవచ్చింది. కాని చేసేది లేక, "ఒరే, రంగడూ!" అని కేకపెట్టాడు.

రంగడు తన దిక్కుగానే చూశాడు గాని తనకేసి చూడలేదు. వాడికి మసక చీకట్లో లావుపాటి శరీరమూ, బట్టతలా, నెరసినమీసాలూ, కళ్లజోడూ అవుపించింది.

"అట్లా చూస్తావేంరా, రంగడూ? నేనే" అన్నాడు సత్యం దగ్గిరికివస్తూ.

ఆ వచ్చే పెద్దమనిషి సత్యం తండ్రి అని తెలియగానే రంగడి ప్రాణాలు పైనే పోయాయి. తనతో స్నేహం చెయ్యవద్దని సత్యాన్ని ఎన్నోసార్లు ఈయనే కొట్టివున్నాడు కూడానూ. ఆ కారణంచేతనే ఎప్పుడన్నా సత్యాన్ని పిలవవలిసివస్తే రంగడు ఇంట్లోకి రాక బయటనుంచి ఒకరకంగా యీల వేస్తాడు. ఆ యీల విని సత్యం రంగణ్ణి గుర్తించి బయటికివస్తూ ఉంటాడు. ఇప్పుడా రహస్యంకూడా నూరయ్యగారికి తెలిసి





పోయిందనుకున్నాడు. రంగడు చీకట్లోపడి దవుడుతీశాడు.

"ఎందుకురా, పారిపోతావ్? నేనేరా. వెధవా?" అంటూ సత్యం కేకపెట్టసాగాడు, కాని రంగడు వినిపించుకోకుండా పారి పోయినాడు.

"ఏం. పంతులుగారూ? ఆ బ్బాయి కోసమా కేకవేస్తున్నారు?" అని ఎవరో పలకరించారు. సత్యం యిక వీధిలో ఆగక గబగబా యింటో జొరబడ్డాడు.

ఆ రాత్రి సత్యం తన తండ్రిపక్కలో పడుకున్నాడు.

"ఈ జీవితం చాలా బాగుంది. కావలిసినంత డబ్బు. అందరూ గౌరవించేవాళ్ళే. ఎరగనివాళ్లు పలకరించి ప్పుడు మాత్రం చిక్కు. అదిన్నీ, తన పాతస్నేహితులు తన్ను చూసి భయపడి పోతున్నారు.

"అయినా ఈ జీవితమే బాగుంది. పిల్ల వాడుగా ఉండటంకన్న పాపంలేదు. ఈ ప్రపంచం పెద్దవాళ్లో"దనుకున్నాడు సత్యం.

# రాజాధీనం - దైవాధీనం

ఒక రాజ్యంలో ఇద్దరు బ్రాహ్మలుండేవారు. ఇద్దరూ నిరుపేదలు. అందుచేత రాజుగారి దగ్గిరికివచ్చి యాచించి పోతూ ఉండేవాళ్లు.

అందులో ఒకడు, "తమరు ప్రభువులు! తమరాజ్యం చల్లగా ఉండాలి. తమకు కల దాన్లో మాబోటి పేదలకింత పెట్టాలి. అంతా రాజాధీనం!" అనేవాడు.

రెండోవాడు, "తమమీద భగవంతుడి కటాక్షం ఉండాలి. తమచేత భగవంతుడు మాబోటివాళ్లకింత ఇప్పించాలి. అంతా దైవాధీనం!" అనేవాడు.

రాజుగారు ఇద్దరికీ తోచినది ఇచ్చేవాడే కాని ఆయనకు మొదటి బ్రాహ్మడిమీద అభిమానం జాస్తిగా ఉండేది. ఆయన మంత్రితో అన్నాడుగదా, "నేను రాజును. నా ప్రజలకు ఏంచేసినా నేను చేయాలి గాని మధ్య భగవంతుడేమిటి? అయినా, దైవాధీనం ఎంతవరకో చూతాం. ఒక గుమ్మడికాయ తెప్పించి దాని తొడిమ తీయించి లోపల డొల్లచేసి అందులో వజ్రాలూ, వైడూర్యాలూ, మరకతాలూ, మాణిక్యాలూ పోయించి మళ్లీ తెలియరాకుండా తొడిమ అంటించు. దాన్ని రేపు ఉదయం మొదటవచ్చిన బ్రాహ్మడికిద్దాం. ఏ బ్రాహ్మడికది దక్కుతుందో చూద్దాం!" అన్నాడు.

రాజుగారు చెప్పినట్టే గుమ్మడికాయ తయారు చేయించాడు మంత్రి. తెల్లవారక ముందే "రాజాధీనం" అనే బ్రాహ్మడు వచ్చి, "తాము ప్రభువులు. తమరాజ్యం చల్లగా ఉండాలి. తమకుగల దానిలో మాబోటివాళ్లకి ఏదో ఇంత ఇప్పించాలి. అంతా రాజాధీనం!" అన్నాడు. బ్రాహ్మడికి మంత్రి గుమ్మడికాయ ఇచ్చి పంపేశాడు.

"చూశావా? ఇప్పు డేమంటావు?" అన్నాడు రాజు గర్వంగా.

గుమ్మడికాయ పట్టుకునిపోతూ బ్రాహ్మడు, "ఇదేమిటి? రాజుగారు ఇన్ని తండులాలిప్పించక ఈ దిక్కుమాలిన గుమ్మడికాయ ఇప్పించారు. దీన్ని ఎవరికన్నా

పేరిన అప్పలరాజు, విశాఖపట్నం
పాలపర్తి భానుమతి, బాపట్ల

యిచ్చి బియ్యం పట్టుకుపోదాం. చెడ్డ ఖరుపు ఉంది కూడానూ!" అనుకున్నాడు.

దారిలో ఒక వర్తకుడిదగ్గర ఆ గుమ్మడి కాయ ఇచ్చేసి తనకు కావలిసిన బియ్యం పట్టుకుని ఇంటికి చక్కా వెళ్ళాడు మొదటి బ్రాహ్మడు.



తరవాత కాసేపటికి రెండో బ్రాహ్మడు అడావిడిపడుతూ వర్తకుడిదగ్గిర గుమ్మడి కాయచూసి, "అయ్యా, ఈపూట మా యింటికి అతిథులొచ్చారు. కూరలేదు. ఆ గుమ్మడికాయ ఇప్పించండి." అన్నాడు.

వర్తకుడు, 'సరే పట్టుకు పొమ్మ'ని గుమ్మడికాయ యిచ్చాడు.

రెండో బ్రాహ్మడు గుమ్మడికాయ ఇంటికి పట్టుకెళ్లి పెళ్ళాంచేతికిచ్చి తరిగిస్తే లోపల దాని నిండా రత్నాలు!



"ఇదే గదా దైవాధీనమంటే," అనుకున్నాడు బ్రాహ్మడు.

మర్నాడు యథాప్రకారం మొదటి బ్రాహ్మడు రాజుగారిదగ్గిరికి యాచనకు వెళ్ళాడు. 'ఇన్ని రత్నాలిచ్చినా మళ్ళీ ముష్టికొచ్చాడేమిటీ బ్రాహ్మడు!' అని రాజుగారికి ఆశ్చర్యం కలిగింది.

"నిన్న నేనుయిచ్చిన గుమ్మడికాయ భోంచేశారా?" అన్నాడు రాజు.

"ఓ, మహా రుచిగా ఉన్నది. అంతా రాజాధీనం!" అన్నాడు బ్రాహ్మడు.

"అంతా మీరే భోంచేశారా? కొంత ఎవరికైనా యిచ్చారా?" అన్నాడు రాజు.

"అంతా మేమే భోంచేశాం, ప్రభూ!





తమరిచ్చిన ప్రసాదం పైకి పోనిస్తామా! అంతా రాజాధీనం" అన్నాడు బ్రాహ్మడు.

"ఈ అబద్ధాల బ్రాహ్మణ్ణి వీపు చిట్లగొట్టండి!" అన్నాడు రాజు.

దెబ్బ అనగానే దయ్యం వొదిలి బ్రాహ్మడు జరిగినదంతా చెప్పేశాడు. గుమ్మడికాయ వర్తకుడిదగ్గిర బ్రాహ్మడిచ్చినట్టువిని రాజు వర్తకుణ్ణి పిలిపించి, "నిన్న ఈ బ్రాహ్మడిచ్చిన గుమ్మడి కాయ ఏంచేశావు?" అని అడిగాడు.

"బ్రాహ్మడి సొత్తు నాకెందుకు, మహారాజా! అది మరో బ్రాహ్మడికి దానం చేశాను!" అన్నాడు వర్తకుడు.

రాజుగారు రెండో బ్రాహ్మడిని పిలిపించి, "నిన్న వర్తకుడిదగ్గిర పుచ్చుకున్న గుమ్మడి కాయ మీ ఇంటో వుంచుకున్నారా?" అని అడిగాడు.

"వుండుకోటాని కెక్కడిది, మహారాజా! దాన్ని కోసి చూద్దుముగదా. దానినిండా రత్నాలూ, కెంపులూనూ! అంతా దైవాధీనం. భగవంతుడి అనుగ్రహంచేత నా దారిద్ర్యం తీరిపోయింది." అన్నాడు రెండో బ్రాహ్మడు.

తాను మేలుచెయ్యదలిచింది మొదటి బ్రాహ్మడికి. కాని మేలుజరిగింది రెండో బ్రాహ్మడికి. అంతా దైవాధీనమేగాని తన అధీనంలో ఏమీలేదని బుద్ధితెచ్చుకుని రాజు పొగరు చంపేసుకున్నాడు. మాటి మాటికీ "రాజాధీనం" అంటూ తనకు పొగరెక్కించిన మొదటి బ్రాహ్మణ్ణి తన దగ్గిరికి ఎన్నడూ రావద్దని తరిమేశాడు.








# అల్లుడికి విందు

అనగా అనగా ఒక వూళ్లో గయ్యాళి పిచ్చెమ్మ అనే పేరుగలామె వుంది. ఆమె భర్త చనిపోయ్యేప్పుడు యిచ్చిన రెండెకరాల భూమీ అమ్మి ఒక్కొగానొక్క కూతురు పెళ్లి చేసి అత్తవారింటికి పంపింది. తనకల్లా మిగిలింది ఒకచిన్న పిల్లల పద్ద పెంకుటిల్లు అంతే. తినటానికికూడా గడవడం కష్టంగా వుండడంవల్ల ఒకపూటకు వుంటే యింకోపూట పస్తులుంటూ ఆవిడ గడుపుకొస్తోంది. కాని ఆవిడ నోరంటే అంతా భయపడేవారు యిరుగు పొరుగు. దీపావళి పండుగ రెండు రోజులుందనగా అల్లుళ్లు అత్తగారిండ్లకు వచ్చారు. పిచ్చెమ్మ పక్కింటి అల్లుడు కూడా వచ్చాడు. అల్లుడొస్తే ఆపూటకు తిండిపెట్టలేని పిచ్చెమ్మ అల్లుణ్ణి రమ్మని ఎలా వ్రాస్తుంది?—దిగులుగా అందరి అల్లుళ్లనిచూస్తూ కూర్చుంది పిచ్చెమ్మ. కూతురు జాబువ్రాసింది. అందులో తన భర్త వూళ్లోలేడనీ, పైవూళ్లకు వెళ్లాడనీ, దీపావళికి రావడానికి వీలుండదు అనీ



వ్రాసింది. పిచ్చెమ్మకు కొంతవరకు మనసు కుదుటపడింది. ఎవరో అడిగితే, 'అల్లుడు పనిమీద పట్నం వెళ్లాడు. పెద్దపండక్కొస్తాడు' అని కోసింది.

ఆనాడు దీపావళి పండుగ. పొద్దుట అందరూ దీపావళి పిండివంటలుచేస్తూ లోపల ఎవరి పనిమీద వాళ్లున్నారు అన్నియిళ్లల్లో. పాపం పిచ్చెమ్మ ఒక్కత్తెమాత్రం చెంపన చేయిపెట్టుకుని బయటపంచలో కూర్చుంది. ఆపూటకు వండటానికి నూకలులేవు; పండగచేసే వాళ్ల ముఖాలు చూడాల్సిందే. ఏదో బండి చప్పుడైంది. తొంగిచూసింది-బండ్లోంచి అల్లుడుదిగుతున్నాడు. పిచ్చెమ్మకు ముచ్చెమటలు పోశాయి - నోట మాటరాలేదు. ఎల్లాగో కాళ్లకు నీళ్లిస్తూ "వూళ్లో లేవని అమ్మాయి వ్రాసిందే" అన్నది. అల్లుడు ముఖం కడుక్కుంటూ, "అవును. పై వూళ్లకు పనిగా వెళ్లాను. నేడు రేపు ఈ ఊళ్లో పని మాచుకు వెళతాను యింటికి" అన్నాడు. పిచ్చెమ్మకు ఏమీపాలుపోలేదు. ఆపూట పొయిమీదపిల్లి లేచేసూచనలూ కనుపించలా. పండగపూట బియ్యం అప్పు ఎవరిస్తారు? ఎవర్నడగడం? యింతకు ముందిచ్చినవారికి తీరిస్తేగా? ఎల్లాగోలాగు ఆపూటకైనా ముందు

పి. భానుమతి





అల్లుడికి భోజనంపెట్టాలి. పిచ్చెమ్మకు ఒక వుపాయు తట్టింది. వెంటనే తను చేత్తో వడికి నేయించి అట్టేపెట్టిన 8 గజాల ఖద్దరు చీర కట్టుకుని పక్కింటివాళ్ళ ఇంటికివెళ్ళింది. అల్లుడు బయట పంచలో పడుకుని పెంకులు లెక్కబెడుతున్నాడు.

తలుపు తీసుకునిలోపల పని చేసుకుంటున్నవాళ్లు పిచ్చెమ్మ రాగానే యింటామె తలుపు తీసింది. పిచ్చెమ్మ లేని నవ్వు అంతా నవ్వుతూ వాళ్ళింట్లో మూల పెద్దవడ్లరాసివుంటేదాని మీదపోయి కూర్చుంది చిన్నపిల్లలాగ. ఆ యింటావిడ చాపతెచ్చివేసి కూర్చోమంది. "ఫర్వాలేదు; నాకు వడ్లవాసన అంటే యిష్టం-యిక్కడ కూర్చుంటాలే. మంచివడ్లు-ఎన్ని పుట్లొచ్చాయి" అంటూ పిచ్చెమ్మ వడ్లమీద "రోలర్" లాగు దొర్లుతో కూర్చుంది. యింటావిడ రెండు మాటలుమాట్లాడి 'ఇప్పుడేవస్తా'నంటూ వంటింట్లోకి వెళ్ళింది. "నేను ఏళ్ళీ వస్తా"నంటూ ఆవిడ అటుపోగానే పిచ్చెమ్మ చీరకు బాగా అంటుకున్న వడ్లతో యింటికొచ్చి గబగబ లోపలికెళ్ళి, నట్టింట విదిలించింది. దాదాపు ఒక మానెడువడ్లు రాలాయి - బ్రతుకు జీవుడా అనుకుని అవి దంచడం మొదలెట్టింది. యిదంతా అల్లుడు చూస్తూనే వున్నాడు. తర్వాత ఆవిడ దొడ్డిలో కాసిన తోటకూరకూడావండి అల్లుడికి మధ్యాన్నం 2 గంటలకు భోజనంపెట్టింది. అల్లుడు భోంచేసి బయట పంచలోకి వచ్చాడు. పక్కింటి ముసలాయన పంచచూరుకు గుమ్మటం కడుతూ "ఏమండీ ఎప్పుడు రావడం! భోజనం అయిందా?" అని అడిగాడు. అల్లుడు త్రేన్చుతూ "ఆ అయిందండీ, వూళ్ళో వాళ్ళ వడ్లపుణ్యాన, మా అత్త చీర పుణ్యాన, ఎల్లాగో లాగు" అన్నాడు. ముసలాయన కర్థంకాక తలవూపి వూరుకున్నాడు.




కాకమ్మక్కా, కాకిబావా కాకుల వంశంలో పుట్టారు. అసలు కాకి వంశం ఎట్లా పుట్టిందో మీకు తెలుసా? దాన్ని గురించి ఒక కథ ఉన్నది అది నిజమవునో కాదో మనకు తెలీదు. కాని ముసలమ్మలు మాత్రం ఈ కథ చెబుతారు.

అనగా అనగా ఒక ఊళ్లో ఇద్దరు పిల్లలుండేవాళ్లట. అందులో ఒకడు అబ్బాయి, రెండవది అమ్మాయి. ఈ పిల్లలకు పసితనంలోకూడా బొత్తిగా భయభక్తులు లేకపోవటంవల్ల నానా అల్లరీచేసి, ఇల్లంతా ఒక కొలిక్కి తెస్తూ, ఊరూనాడూ ఏకంచేస్తూ విచ్చలవిడిగా సంచరించేవాళ్లట. ఏజంతువు కనిపించినా దాన్ని చంపుకుతినటమే, కనపడ్డ పిల్లలనందర్నీ కొట్టటమే, అందరి ఇళ్లమీదా రాళ్లరువ్వటమే, అందిన వస్తువునల్లా ధ్వంసం చెయ్యటమే. ఈవిధంగా ఉండేదిట వాళ్ళ ప్రవర్తన.

బళ్లో పడేస్తే వీళ్లకేమైనా బుద్ధి వస్తుందేమోనని పెద్దవాళ్లు వీళ్లని బడికి పంపించారు. బడిపంతులుకూడా వీళ్లతో వేగలేక ఇంటికిపోయేడు. వీళ్ల మీదికసి పెళ్లాంమీద తీర్చుకునే వాడుట.

ఇంకేముందీ? ఊళ్లో ఈ పిల్లలంటే అసహ్యపడని పిల్లలుగాని పెద్దలుగానిలేరు. వాళ్లని అదుపాజ్ఞల్లో ఉంచగలవాళ్ళు అంతకుముందే లేరు. వాళ్ల దేరాజ్యం. "ఈ పిల్లలకి చావన్నా రాదేం?" అని అందరూ తిట్టుకునేవారు. వీళ్లచస్తే దేవుడికి కొబ్బరికాయలు కొడతామనీ, అభిషేకాలు చేయిస్తామనీ, పండగలు చేసుకుంటామనీ అందరూ అనుకునేవాళ్ళే.



పిల్లలిద్దరూ కాళికాదేవి వెనకాల దాక్కున్నారు

ఇట్లాఉండగా ఒకరోజు ఏం జరిగిందంటే, ఊళ్లోవాళ్లంతా ఊరిబయట ఉన్న కాళికాదేవి గుడికివెళ్లి నైవేద్యాలుపెట్టి కాళికాదేవిని ప్రార్థించారు, ఈ పిల్లల బాధ తప్పించమని. ఈ సంగతి ముందుగానే తెలిసి పిల్లలిద్దరూ దేవాలయంలో కాళికాదేవి విగ్రహం చాటున దాక్కున్నారు.

వచ్చినవాళ్లు దేవికి నైవేద్యాలుపెట్టి మొక్కనే సమయంలో ఆపిల్ల ఏం చేసిందంటే, "మీకోరిక నేను నెరవేరుస్తాను. ఆపిల్లలని నాకు వొదిలిపెట్టండి.

మీరు మాత్రం వాళ్ల మీద దెయ్యి చేసుకోకండి. వాళ్ల సంగతి నేనే చూస్తాను." అని విగ్రహం వెనకనుంచి చెప్పింది. కాళికాదేవే పలికిందని అందరూ సంతోషించారు. ఎవరిదారినవారు ఇళ్లకు వెళ్లారు.

అందరూ వెళ్లిపోయినదాకా ఉండి ఈ పిల్లలుకూడా వెళ్లబోతూండగా కాళికాదేవి చెరొకర్నీ చెరొక రెక్కా పట్టుకుని పిలవేసి "పొట్టి గడుగ్గాయలై పోయినారు! మీ అల్లరి మానుతారా, మానరా?" అని అడిగిందట.

ఆ రాక్షస ప్పిల్లలకి కాళికాదేవి ఒక లెక్కా, జమా? "నీ మొహంచూడు దిష్టిపిడతల్లే ఉందో! నువామాకు చెప్పే దానివి? ఎన్నడన్నా నీళ్లుపోసుకున్న పాపాన పోయినావా? నీనోరుచూడు ఎంత పాడుకంపు కొడుతుందో! అర్ధమైన వచ్చిమాంసమూతింటే ఏమవుతుంది?" అన్నాడు అబ్బాయి.

"పోవే తాగుబోతా! నీ మెళ్లో పుర్రెలదండచూడు! మాకేమిటో చెప్ప వచ్చావుగాని!" అన్నది అమ్మాయి.

వీళ్ల అఘాయిత్యంచూసి కాళికాదేవే విభ్రాంతపోయిందిట. ఇటువంటి పిల్లలు మనుషులుగా ఉండదగరని నిశ్చయించుకుని, ఇంతబొగ్గు గంధం తీసి వాళ్లిద్దరికీ ఒంటినిండా, అపాదమస్తకమూ పట్టించి, చెరొకచేత్తోటి చెరొకర్నీ ఎగరవేసిందట. తక్షణం వాళ్లిద్దరు కాకులై పోయినారుట. ఆనాటి నుంచీ వాళ్ల వంశంవాళ్లు చెట్లూ పుట్టలూ పట్టుకు తిరుగుతున్నారుట.

ఈ కథ నిజమే అయిఉండవచ్చు. అందుకనే మనం చెప్పినమాట వినని వాణ్ణి, "కాకివెధవా!" అంటాం. చదువూ సంధ్యా లేకుండా తిరిగేవాణ్ణి "కాకి తిరిగినట్టు తిరుగుతున్నాడు," అంటాం.

కాకమ్మక్కా, కాకిబావా ఇటువంటి కాకివంశంలో జన్మించారు.

[అయిపోయింది]



## చిక్కు మాట

(కూర్పు: వెంపటి హేమలత, నర్సరావుపేట.)

అబ్బాయిలూ, అమ్మాయిలూ!

నేను ఐదు అక్షరాల దేవుణ్ణి.
నేను చలిలోవున్నాగాని, వేడిలోలేను
పులిలోవున్నాగాని, సింహంలోలేను
వెండిలోవున్నాగాని, బంగారంలోలేను
కలువలోవున్నాగాని, తామరలోలేను
పిడుగులోవున్నాగాని, మెరుపులోలేను

నే నెవరో కనుక్కోండి?

(జవాబు 50వ పేజీ అడుగున చూడండి)

### పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| కో | ది | | | | రో | జా |
| క | మ్మ | ని | | నా | గ | లి |
| | గు | రు | వా | ర | ము | |
| | | ద్వే | | ద | | |
| | సు | గు | ణా | ము | లు | |
| బా | తు | లు | | ని | డు | పు |
| కీ | డు | | | | బ | ట్టి |

# చందమామ

## వ్యాసరచన పోటీ

★

సెప్టెంబరు నెల పోటీవ్యాసాలలో మూడవ బహుమతిపొందిన "మా జాకీ" అనేకథ ఈ సంచికలో వేశాం. దీంతో సెప్టెంబరు పోటీవ్యాసాలకి బహుమతులు పూర్తి అయినై.

వచ్చే నెల వ్యాసరచనపోటీకి "అమ్మమ్మ శాస్త్రాలు" తీసుకుందాం. మీ అమ్మమ్మలు మీకు ఎన్నో రకరకాల గమ్మత్తు గమ్మత్తు శాస్త్రాలు చెబుతూ వుంటారు. చక్కటి శాస్త్రం ఏదైనా, వ్రాసి పంపండి. అది దెయ్యాల శాస్త్రమైనా సరే, దొంగల శాస్త్రమైనా సరే.

పోటీవ్యాసాలు పంపేటప్పుడు ఈ క్రిందివిషయాలు ముఖ్యంగా గుర్తుంచుకోండి: వ్యాసం పేజీగాని పేజిన్నరగాని మించకూడదు. వ్యాసంపైన "పోటీ వ్యాసం" అని స్పష్టంగా వ్రాయాలి. మీరు పంపేవ్యాసం మా ఆఫీసుకు 10 వ తేదీలోగా చేరాలి.

—సంచాలకుడు.

అబ్బాయిలూ,
అమ్మాయిలూ!

చూశారా ఈచదరం. ఇందులో ఆవు మేత మెయ్యటానికి బయలు దేరి,అలా ఆ బయలూ ఆ బయలూ తిరుగుతూ యింటినించి చాలా దూరం వచ్చేసింది. అది తిరిగి యింటికి పోదా మంటే పాపం దానికి దారి తెలియలేదు. దాన్ని జాగ్రత్తగా సరిఅయిన దోవన మళ్లా యింటికి చేర్చండి చూదాం.



## నీడ బొమ్మలు



కుక్క



తాబేలు



పంది

49 పేజీలోని చిక్కుమాటకు జవాబు : 'చలివెలుగు'




## మా జాకీ — రమ, సూజవీడు.

మేము ఆమధ్య నే కుక్క పిల్లని పెంచుకున్నాం. చాలా అందమైన బొచ్చు దానికి. నల్లని మచ్చలు. అది నా పక్కలోనే పడుకునేది. నాకూ తమ్ముడికీ దానికోసం పోట్లాట వొచ్చింది. నావెంట తిరుగుతోందని దాన్ని కొట్టాడు. జాకీ తమ్ముణ్ణి చూడగానే తోక ముడిచి మంచంకింద దూరేది. తనకి యింకో కుక్కపిల్ల కావాలని ఏడ్చాడు. కాని ఇంకోటి ఎక్కణ్ణించి వొస్తుంది? నాలుగు రోజుల తరువాత మా జాకీ కనిపించటం మానేసింది. యెంత వెతికినా కనపళ్లేదు. నేను అన్నం తినటంలేదు. ఒకటే ఏడ్చాను. కాని



తమ్ముడు సంతోషంగానే ఉన్నాడు. పైగా 'బోలెడు కుక్కపిల్లలు వొస్తాయి. ఎందుకు ఏడుస్తావు?" అన్నాడు. 'చూశారా వాడి వేదాంతం, యింత చిన్నప్పుడే?' అని మురిసింది అమ్మ.

కుక్కపిల్లని మరిచిపోయినాము. రోజూ మా తమ్ముడు మాత్రం చెంబుతో నీళ్ళు తీసుకువెళ్లి దొడ్డిమూల పోస్తున్నాడు. 'ఎన్నాళ్లకి మొలవదేంరా ఆ మొక్క?' అంటుంది అమ్మ. ఓరోజు నాన్నని తమ్ముడు అడుగుతున్నాడు "నాన్నా, శనగగింజలు ఎన్నాళ్లకి మొలుస్తాయి?" అని. "వారంరోజులకి" అన్నాడు నాన్న. "చిక్కుడుగింజలో! గుమ్మడిగింజలో!" అని అడిగి, "పిచికలో?" అన్నాడు. "పిచ్చికలు మొలవడం ఏమిట్రా వెధవా!" అన్నారు నాన్న. తమ్ముడు కొంచం యోచించి చాలా దిగులుగా "కుక్కపిల్లలూ మొలవ్వా?" అన్నాడు. నాన్న నవ్వారు.

"మరి కుక్కపిల్లని దొడ్లో పాతేసి రోజూ నీళ్ళుపోస్తోవుంటే, కుక్కపిల్లల చెట్టు మొలవదా, ఏమిటి!" అన్నాడు రోషంతో. చప్పున నాకొకటి తట్టింది. పరిగెత్తికెళ్లి మా తమ్ముడు నీళ్లు పోసేచోట దొడ్డిమూల గరిటతో తవ్వాను. కుక్కపిల్ల చచ్చి కుళ్లి వాసనవేస్తోంది.





మూడవ బహుమతి పొందిన పోటీ వ్యాసం.







## ఆధారములు

**అడ్డము:**

1. క్కొక్కొరో కో అని కూయును.
3. గులాబీపువ్వు.
5. రుచిరమైన.
7. దీనితో రైతు భూమిని దున్నును.
8. ఏడు వారములలో ఒకటి.
9. మంచిగుణములు.
11. నీళ్ళలో ఉండెడి పక్షులు.
12. దీర్ఘము.
14. హాని.
15. దీనిని సాలెవాడు నేయును.

**నిలువు:**

1. స్త్రీలు ధరింతురు.
2. పెద్దకాయలు కాచెడిపాదు. (తలక్రిందులు)
3. ఇది వచ్చినయెడల మందు తీసికొనవలెను.
4. కరుణ.
6. పనిలేనివాడు.
7. కలహములు పెట్టు ఋషి.
9. పుత్రుడు.
10. పాఠశాలలు (తలక్రిందులు).
11. ఋణము.
13. పాము నివసించుచోటు.

వెలువడింది

# సంచారి

రాజకీయ మాసపత్రిక.



ప్రపంచ వ్యవహారాలూ, దేశీయ ప్రాంతీయ వ్యవహారాలూ మూలగుట్టుతోసహా తెలుసుకుని దైనిక వార్తలను సరి అయిన దృష్టిలో అవగాహన చేసుకోగలందులకు "సంచారి" ప్రతినెలా చదవండి. తెలుగులో ఇటువంటి పత్రిక మరొకటి లేదు. నేటి ప్రపంచం పోకడలను సంగ్రహంగా విప్పి చెప్పగల పత్రిక "సంచారి". మొదటి సంచిక ఇప్పుడే వెలువడింది. మీ కాపీకి మా ఏజెంట్లను అడగండి.

వెల 0-6-0



ఆఫీసు:

37, ఆచారప్పన్ వీధి, మద్రాసు 1.

## మన్నికకు, అందానికి,



# ఇండియా సిరామిక్స్ లిమిటెడ్

నెల్లూరు - కాళహస్తి - మద్రాసు

---

# ఈస్ట్ అండ్ వెస్ట్

## ఇన్షూరెన్సు కంపెనీ, లిమిటెడ్, బొంబాయి.

[1913 లో స్థాపితం]

ప్రధాన కార్యాలయం :

'ఈస్ట్ అండ్ వెస్ట్ బిల్డింగ్', ఫోర్టు, బొంబాయి.

33 సంవత్సరాలుగా దేశసేవచేస్తూ జాతీయోన్నతి పెంపొందిస్తూ ఉన్న ప్రముఖ భారతీయ భీమాసంస్థ.

ఆర్థికంగా సుస్థిరమై, పాలసీదార్లతోనూ, ఏజంట్లతోనూ వ్యవహరించుటలో సంస్కారానికి పేరెన్నికగన్న సంస్థ.

1944 లో జరిపిన అదనపువ్యాపారం కోటిరూపాయలు మించింది.

చురుకైనటువంటిన్నీ, పలుకుబడి కలిగినటువంటిన్నీ వ్యక్తులు ఏజన్సీలకొరకు దరఖాస్తులు పెట్టుకోవచ్చును.

వివరాలకు:

శ్రీ జె. యస్. రెడ్డి
బ్రాంచి సెక్రటరీ.,
377, ఎస్ప్లనేడ్,
మద్రాసు.

★

శ్రీ వి. ఎ. నాగరెడ్డి
చీఫ్ ఏజంటు,
రాయలసీమ ఏరియా,
విక్టోరియాపేట, ఆదోని.

శ్రీ యస్. మల్లికార్జునరావు, ఆర్గనైజింగ్ సెక్రటరీ, బెజవాడ.

